# భగవద్గీతానువాదము

(పద్యరూపకాంధ్రీకరణము)



అఖిల సచ్ఛాస్త్రములు ధేను ♦ లై రహింప,
పాలు పితికెడివాఁడు గో ♦ పాలకృష్ణ,
సజ్జనుఁడు దూడ, పాలు గీ ♦ తామృతంబు,
ధన్య జీవితు లీపాలు ♦ ద్రావువారు॥

వ ౨౮

మయిలవరపు వేంకటరామయ్య, బి.ఏ., యల్.టి.

శ్రీ

# భగవద్గీతానువాదము

## ( పద్యరూపకాంధ్రీకరణము )

---

తే॥ గీ॥ దేవుఁ డొక్కఁడె : శ్రీకృష్ణ ♦ దివ్యమూర్తి;
శాస్త్ర మొక్కటె : రామాను ♦ జన్మ "గీత";
కర్మ మొక్కటె : రుక్మిణీ ♦ కాంతు సేవ;
మంత్ర మొక్కటె : కృష్ణ నా ♦ మంబు, పృథ!॥

---


భజగోవిందశ్లోక పద్యరూపకాంధ్రీకరణ,
పాండవలీలా కావ్య, గీతాప్రశ్నోత్తరమాలా, కర్తయగు
మయిలవరపు వేంకటరామయ్య, బి. యే., యల్. టి., చే



రచింపఁబడి, ప్రకటింపఁబడినది.

3/118, బ్రాడీపేట (తిలక్ పేట), గుంటూరు.

కల్యాది 5040, ప్రమాథినామ సంవత్సరము

1939




వెల : రు 0-8-0
పాఠశాలావిద్యార్థులకు : రు 0-4-
బీదలకు : ఉచితము.

1—104 పేజీలు : గుంటూరు, ఓంకార్ ప్రెస్‌లోను,
మిగిలినభాగ మంతయు : గుంటూరు, ప్రభాకర ప్రెస్‌లోను
ముద్రింపఁబడెను.

మొదటికూర్పు : 1000 ప్రతులు.

# ఆశీస్సు

శ్రీః

బృహతో స్వరూపజ్ఞానం
పండితానేక దృష్టి మేళనా ద్భవతి ।
త న్మార్గదర్శి శాస్త్రం
గీతా చ బహు సూక్ష్మదర్శిభి ర్మథితా ॥ 1

తాదృశ యత్నే ష్వేకః
ప్రకృతీనాం భూతి కాంక్షిణో ఽస్య మిత్రస్య ।
త్రిపురాదేవీ కృపయా
ప్రసరతు లోకే గీతానువాదో ఽయమ్ ॥ 2

(1. అనంతమగు బ్రహ్మముయొక్క స్వరూపజ్ఞానము, అనేక బ్రహ్మవేత్తల దృష్టుల మేళనముచేతఁ గల్గుచున్నది. అట్టి బ్రహ్మమునకు మార్గమును జూపు శాస్త్రమైన భగవద్గీత, అనేకులైన సూక్ష్మదర్శులచే (నానావిధముల) మథింపఁబడినది.

2. సామాన్యజన శ్రేయోభిలాషి యగు నా మిత్రుని యీ గీతానువాదము, అట్టి ప్రయత్నములలో నొకటి. ఇయ్యది త్రిపురాదేవి కృపచేత, లోకమునందు వ్యాపించుఁగాత !)

గుంటూరు,
కొత్తపేట,
26-7-1939

ఎస్. ఆర్. సీతారామశాస్త్రి,
శ్రీ భగవద్గీతా ప్రచారక సంఘాధ్యక్షుఁడు,
&
హిందూ కాలేజీ హైస్కూలు ఆంధ్రసాహిత్యోపాధ్యాయుఁడు,
గుంటూరు.

# నమస్సు

ఓమ్.

అస్మద్గురు సమారంభాం శంకరాచార్య మధ్యమామ్
లక్ష్మీవల్లభ పర్యంతాం వందే గురు పరంపరామ్॥ 1

కృష్ణాయ యాదవేంద్రాయ జ్ఞానముద్రాయ యోగినే
నాథాయ రుక్మిణీశాయ నమో వేదాంతవేదినే॥ 2

అగ్రే కృత్వా కమపి చరణం జాను నైకేన తిష్ఠన్
పశ్చా త్పార్థం ప్రణయసజుషా చక్షుషాఽవేక్షమాణః
సవ్యేతోత్త్రం కరసరసిజే దక్షిణే జ్ఞానముద్రా
మాబిభ్రాణో రథమధివసన్ పాతున స్సూతవేషః॥ 3

పార్థాయ ప్రతిబోధితాం భగవతా నారాయణేన స్వయమ్
వ్యాసేన గ్రథితాం పురాణమునినా మధ్యే మహాభారతమ్
* అద్వైతామృత వర్షిణీం భగవతీ మష్టాదశాధ్యాయినీమ్,
అంబ! త్వా మనుసందధామి, భగవద్గీతే! భవ ద్వేషిణీమ్॥ 4

---

* భక్తి జ్ఞాన విశాలనేత్ర యుగళాం నిష్కామ కర్మాశయామ్,

# తొలి పలుకు

భగవద్గీతాగ్రంథ మధ్యాత్మ విషయములనే గాక కర్మయోగంబునుగూడఁ జక్కగ విశదీకరించుటచే నేతత్పాఠకులు ప్రాపంచిక జీవితములందున్నైతము అలసులుగాక నేర్పుతోఁ దమవిధులను నిర్వహించుకొని శ్రేయఃపాత్రులు కాఁగలరనువిషయము లోకవిదితము. ఇట్టి యుత్తమ గ్రంథమును మ. రా. రా. మయిలవరపు వేంకటరామయ్య, బి.ఎ., ఎల్.టి. గారు 'భగవద్గీతానువాద' మను పేరఁ గంఠస్థము లొనర్చుట కనుకూలముగా సలక్షణమ్ము సుమధురపద్యములతో మూలానుసారముగాఁ దెనిఁగించియున్నారు. వీరు చిరకాల ముపాధ్యాయులుగానుండి బోధనాపద్ధతుల నాటితేఱిన వారగుటచే వీరి యనువాద మెల్లరకు సుబోధ మగుటకు సంశయముండదు. ఇట్టి యుత్కృష్టగ్రంథమును బాలశాలలయందుంచి బాలురచేఁ గంఠపాఠముఁ గావించి వారి భావ్యభ్యుదయమునకు దోహద మొసంగుట సమంజసమని నా యాశయము.

గుంటూరు,
26—7—39

బుద్ధిరాజు రామచంద్రరావు,
ప్రిన్సిపాల్—హెడ్ మాస్టర్,
హిందూకాలేజి—హిందూ కాలేజి హైస్కూలు.

# అభిప్రాయములు

I

ఓం.

## భగవద్గీతానువాదము

## ఆంధ్రము

ఆంధ్రమున నిదివఱకెన్నఁడో మహాభారత మంతయు ననువదింపఁబడి, యీ భగవద్గీతలు మాత్రము వదలివేయఁబడినవి. తదాదిగ నాకొఱఁత పూర్తిచేయఁదలఁచి యనేకు లనేక రీతులఁ దమతమశక్తులకొలఁది పరివర్తనము చేసియున్నారు. మఱికొందఱు కీర్తనలుగ వ్రాసి గీతలను సేవించియున్నారు.

ప్రస్తుతము నాచేతఁగల యాంధ్రానువాదము శ్రీ మయిలవరపు వేంకటరామయ్య, బి. యే., ఎల్. టీ., గారిది. ఈ గ్రంథము సర్వవిధముల నాంధ్రులెల్లరును ఆంధ్రమహాభారతముతోఁబాటును, ఇంకను విశేషించి భగవద్గీతలుగనుక భక్తిశ్రద్ధలతోను గౌరవింపఁదగియున్నది. ప్రాస్తావికశ్లోకముల వలె నుపన్యాసములయందును, విద్యార్థులు వ్యాసములయందును నుపయోగింపఁదగిన పద్య పాదము లనేకములుగలవు.

బాలురకును బాలికలకును జిన్నతనము నుండియు నీపద్యములను నేర్పుచుండినచో వారు పెద్దవారైన తరువాత నీ యనువాదగ్రంథమునే పారాయణ గ్రంథముగఁ జేసికొనవచ్చును. గ్రంథము సులభశైలిలోనే వ్రాయఁబడినది. అయి

నను మధ్యమధ్య నెచటనైనఁ గవన ధోరణిలో నొకటిరెండు కఠినపదములు దొర్లి యుండిన యెడల నట్టివాని నేరి చదువరుల సౌకర్యార్థము 'లఘుటిప్పణి'ఁ జేర్చియున్నారు.

చిన్నప్పటినుండియు వీరియుద్దేశములు శ్రీలోకమాన్యుని జాడల కలవాటుపడియున్నందున నీయనువాదముగూడఁ బోలు వఱ కాభూములయందే తనవిహారము సలిపియుండుట యొక నూతనాంశముగాదు. *

వీరిట్టి దేశోపకారకములగు గ్రంథము లనేకములను వ్రాసి దేశసేవ చేయఁగలరు.

సరస్వతీ సదనము
అగ్రహారము,
గుంటూరు
24-7-39

అని యిట్లు
నారాయణస్మరణము చేయు
పరమహంస యోగానంద సరస్వతి.

* గ్రంథకర్త పీఠిక, X వ పేజీ, మొదటి పేరానుగూడఁ, జూచునది.

II

శ్రీ గురవే నమః

"ఇదియేమి బ్రహ్మవిద్యా?" అను నార్యోక్తినిబట్టి చూడఁగా, తక్కినవిద్యలను సాధించుటకన్న, బ్రహ్మవిద్యాసాధనము సుసాధముగాదని తేలుచున్నది. ఏతద్విద్యాసాధనముకన్న, బోధనము, బోధనముకన్న, భాషాంతరీకరణమును మిగులనసాధ్యములే యనవచ్చును.

అట్టి స్థితిలో, ప్రకృత గీతా కవిమిత్రుఁడు స్త్రీ పురుషులలో, వయో విశేషము లేకుండ, బాల్యదశయందున్న వారు గూడ, సులభముగా, గీతాతత్త్వమును గ్రహించు వేశల పద జాతముతో, ఆయా తావులలో, నాయాయా భిన్న భావములకు, అనుభవజ్ఞులగు ప్రాచీన మహాశయుల యుదాహరణములను, సాధార్థముగాఁగూడఁ జూపుచు, భగవద్గీతను, సమగ్రముగా, సలక్షణముగా, పద్యరూపమునఁ దెలిఁగించిరి.

విద్యాశాఖాధికారులు దయాబుద్ధితోఁబరిశీలించి, తగిన కక్ష్యలకుఁ బాఠ్యముగాఁగూడ నియమించియు కవిమిత్రునకు వలయుసాయమును జేయఁదగియున్నదని నా యభిప్రాయము.

ఇట్లు విద్వద్విధేయుఁడు,

శిష్టా హనుమచ్ఛాస్త్రి,

సీనియర్ తెలుఁగు పండితుఁడు,

హిందూకాలేజీ హైస్కూలు.

గుంటూరు,

24—7—39

# పీఠిక

మన మతగ్రంథములలో నెల్ల, భగవద్గీతయే సర్వజనాదరణీయమైన గ్రంథమనుట నిర్వివాదాంశము. అదియొక్కటియే, క్రైస్తవుల బైబిలువలె, మతప్రచారమున కుపయోగింపఁ దగియున్న ప్రమాణగ్రంథము. కాని, యీనాఁటి రోజులలో, అదిసైతము, భాషాంతరీకరణ సాహాయ్యము లేక గ్రహించుటకు సులభసాధ్యము కాకున్నది. బోధించువారు సంస్కృతశ్లోకముల నన్వయించి చెప్పినను, వినెడి యాబాలగోపాలమునకు శ్లోకమున్న సీలు వేసిన పెట్టెవంటిదే. శ్లోకములనుబట్టి, 'యీశ్లోక మీవిషయమునుగూర్చి ప్రసంగించుచున్నది, దీని మొత్తముధోరణి యిది', అని, తెలుఁగుపద్యములను జదివినమీఁదట గ్రహించునట్లు గ్రహింపఁగలవారిసంఖ్య యీనాఁటి రోజులలో, నత్యల్పము. అర్థము గాకపోయినను, శ్లోకములన్న, అభిరుచియో, అభిమానమో, గలవారు లేకపోలేదు. కాని, అట్టివారు కొన్నితెగలయందుమాత్రమే గలరుగాని, సర్వత్ర గానరారు. కాఁబట్టి, ప్రస్తుతసందర్భములయందు, గీతాబోధను సర్వజనులకుఁ జక్కఁగా అందుబాటులోనికిఁ దీసికొనిరావలయునన్న, వచనరూపకముగనో, పద్యరూపకముగనో, గీతను దేశభాషలోనికి భాషాంతరీకరించుట ఆవశ్యకమగుచున్నది. అందు, వచనరూపక భాషాంతరీకరణముల, నెంత సంక్షిప్తముగాను, విస్పష్టముగాను, జేయసాధ్యమైనను, అట్టి వచనములు, నడకలేని పొడిమాటలగు కారణముచేత, మనస్సున స్థిరముగా నిలువఁజాలినవి కానేరవు. కాఁబట్టియే, పద్యరూపక భాషాంతరీకరణములు వాంఛనీయము లగుచున్నవి. వేయేల, భాషాంతరీకరణావశ్యకతయే యున్నఁ, బద్యరూపక భాషాంతరీకరణావశ్యకతగూడ గలదనుట విస్పష్టము.

మఱియుఁ, బాఠశాలలలోఁగూడ, నీతిమతములను బోధించుట ఆవశ్యకమని యిప్పటి విద్యార్థులు పెక్కండ్రు అంగీకరించుచున్నారు. ప్రస్తుత

విద్యావిధానము, నీతిమతములకు దూరమగుటవలన గల్గినఫలము, మనకే ప్రత్యక్షగోచరమగుచున్నది. నీతిమతములలో, మతమునుండి వేఱుపఱుపఁబడిన కేవల నీతిని బోధించుట సులభసాధ్యమైనపనిగాదు. నీతియనునది ఉపాధ్యాయుని వ్యక్తిని (personality) బట్టి, బాలురకు స్వయంబోధక మగునట్లు చేయవలసినదే గాని, అయ్యది ప్రకృతిశాస్త్రాది పాఠములవలెఁ బ్రత్యేకబోధనకు, అన్నంత సులభముగా, అవకాశ మిచ్చునదిగాదు. వాస్తవముచేత, నీతి, మతమునందలి యంతర్భాగమే. అట్లు మతాంతర్భాగ మగునీతిని, మతాంతర్భాగముగ బోధించినప్పుడే అయ్యది యాదరణీయమును, బోధనా సుసాధ్యమును, అగుచున్నది. ప్రస్తుతవిషయ సందర్భమున, హిందూపాఠశాలలలో, హిందూ నీతిమత బోధన చేయవలయునన్న, భగవద్గీతకంటె సంక్షిప్తమును, సమగ్రమును, సమాదరణీయమును, అయిన ప్రమాణగ్రంథము దొరకఁబోదు. కాని, భగవద్గీతను పాఠశాలలలో బోధించువిషయమున (అద్వైత, విశిష్టాద్వైత, ద్వైత, కర్మయోగ, కర్మసన్న్యాస విషయి కాభిప్రాయ భేదముల మాట యటుండనిచ్చినను) ఒకటి రెండు స్థూలసందేహములు తోఁచకమానవు. కేవలము తెలుఁగునభ్యసించు బహుసంఖ్యాకు లైన విద్యార్థు లందఱును, (గీతా) శ్లోకములయందభిరుచి గలవా రగుదురా, యను బోధనా విషయిక సందేహము మొదటిది. శ్రుతులనుండి స్వీకరింపఁబడిన వాక్యములుగల భగవద్గీతాశ్లోకములను, అందఱును, అన్నప్పుడెల్ల, ఉచ్చరింపవచ్చునా, యను శిష్టజన సందేహము రెండవది. ఈ రెండు సందేహములను, గీతాబోధనా విధాన నిర్ణయాధికారులు ప్రప్రథమమునఁ బాటింప వలసియుండును. ఇట్టి సందర్భములందు, గీతావిషయ బోధన, పాఠశాలలలోని యెల్లరకును జేయుట సాధ్యముగావించుటకు, గీతా పద్యరూప కాంధ్రీకరణములను ఊఁతగాఁ బెట్టికొనుట, యొక సులభమార్గమని యిందుమూలముగ, మనవిచేయుచున్నాఁడను. ఏతన్మార్గమున, గీతావేత్త లగుశిష్టులు, గీతావిషయమును, సంస్కృత సంస్కృతేతర విద్యార్థ్యాత్మకములును, సర్వవర్ణాత్మకములును, అగు క్లాసులయొక్క అందుపాటులోనికిఁ దీసికొనిరావచ్చునని నా విజ్ఞాపనపూర్వకసూచన.

ఈ భాషాంతరీకరణము, మొట్టమొదట, నా "గీతాప్రశ్నోత్తరమాల"కు అనుబంధముగాఁ బ్రారంభింపఁబడినది. ఆ ప్రశ్నోత్తరము, ఇప్పటికి, గీతయందలి మొదటి మూఁడధ్యాయములపై మాత్రమే ముగిసియుండుటచేత, ఆ మూఁడధ్యాయములకు సంబంధించిన పద్యములను మట్టుకే "గీతాప్రశ్నోత్తరమాల"యందు అనుబంధములుగాఁ బ్రచురించియుంటిని. కాని, "గీతాప్రశ్నోత్తరమాల" యుచితముగాఁ బంచిపెట్టుట కుద్దేశింపఁబడినదగుటచేత, దానిని గోరినంత త్వరగాఁ బ్రచురించుటకు సాధ్యపడకున్నది. ఇట్టి సందర్భములోఁ, బ్రథమమున గీతయొక్క ఆంధ్రీకరణము ముగియునట్లు చేయుట యుక్తమని (రిటైర్డుసబ్‌రిజిస్ట్రారుగారగు) బ్రహ్మశ్రీ భువనగిరి కోదండపాణిగారు మున్నగు నాప్తులు ప్రోత్సహించియుండుటచేత, గీతాప్రశ్నోత్తరమాలానుబంధములుగా నుద్దేశించిన పద్యభాగములను ముగించి, "భగవద్గీతానువాద" మను పేరిట, ఈ భగవద్గీతాసంపూర్ణాంధ్రీకరణమును బ్రచురించుచున్నాఁడను.

భగవద్గీత నిదివఱకు, సుప్రసిద్ధ సంస్కృతాంధ్రవేత్తలగు శ్రీ ఆదిపూడి సోమనాధరావుగారు, భక్తాగ్రగణ్యులగు రావుసాహెబు బమ్మ సోమయ్య శ్రేష్ఠిగారు, వేదాంతపారీణులగు శ్రీ పాటిబండ సూర్యనారాయణరావుగారు, మొదలైన యనేకులు, తెనిఁగించియున్నారు. అయినను,

"వరుసం దిక్కనయజ్వ నిర్వచన కావ్యం బొప్పగం జెప్పె ను
త్తరరామాయణ; మందునన్ మఱి ప్రబంధం బూని నిర్మింపు టే
సరసత్వంబని, ప్రాజ్ఞులార! నిరసింపం బోకుఁడీ; రాఘవే
శ్వరుచారిత్రము నెంద ఱెన్నిగతులన్ వర్ణించినం గ్రాలదే".

అని, కంకంటి పాపరాజు తన యుత్తరరామాయణమందుఁ జెప్పినట్లు, గీతావిషయముగూడ నెందఱెన్నివిధముల వ్యక్తీకరించినను, నూతనముగ నుండుననియుఁ, బరమార్థదాయకమే యనియు, విశ్వసించినవాఁడనై, యీ యాంధ్రీకరణమునకు సమకట్టినాఁడను.

ఏ భాషాంతరీకరణము నందైనను, మూలము ననుసరింప వలయుననుట, ముఖ్యోద్దేశములలో నొకటిగా నుండక తప్పదు. ఈ యాంధ్రీకరణము, మూలము నెంతవఱకు అనుసరింపఁ గల్గినదో, ఎక్కడెక్కడ అక్కార్యము నిర్వహింపఁ జాలక పోయినదో, నిర్ణయించుటకు, గీతామూలముతో సమగ్రపరి చయముగల పాఠకమహాశయులే యుక్తాధికారులు. కొలఁది తావులలోఁ, ప్రత్యేక వ్యాఖ్యాతల యభిప్రాయముల నిముడ్చుట అనుచితమనియు, నవసర మనియుఁ, దోఁచినది. అట్లుతోఁచియుండుట, తత్త్వముచేత, గీత యద్వైతబోధక మయ్యు, మార్గవిషయమున "సాంఖ్య" "యోగ"ములకు భేదము చెప్పదనియు, గీతయం దీరెంటుముఖ్యముగా బోధింపఁబడినది సర్వమార్గ సమ్మేళనాత్మకమగు "యోగ" మనియు, నే విశ్వసించినవాఁడ నగుటచేతఁ గావచ్చును. అది యెట్లున్నను, అట్టితావులను, పాదసూచనల (foot-notes) చేఁ దెలియఁ జేసినాఁడను. కొన్ని పాదసూచనలు అభిప్రాయ భేదముల సూచించుటకై కూర్పఁబడిన పాఠాంతరములు.

ఈ భాషాంతరీకరణ సమయమందు, నాకుఁ గల్గిన సందేహముల నివారించి, యీ నా ప్రయత్నమునందు సాయపడిన గుంటూరు హిందూ కాలేజీ, హైస్కూళ్ళ యందలి సంస్కృతాంధ్రోపాధ్యాయులకును, సంస్కృతాంధ్ర భాషావిదులగు నితరోపాధ్యాయులకును, ప్రథమాధ్యాయానువాదమునందును, దదితరాధ్యాయాంతర్గతానేకసంగతి సందర్భములయందును, సహకారి యగు బ్రహ్మశ్రీ వింజమూరి చిన్న సుబ్బారావుగారికిని, నావందనశతంబు లర్పించుచున్నాఁడను.

ఈపుస్తకమునకుఁ దొలిపలుకు వ్రాయుఁడని ప్రార్థించుటతోడనే దయతో నంగీకరించి, వారి యమూల్యాభిప్రాయగర్భితమగు నిందలి "తొలి పలుకు" నొసంగి, తన్మూలముగ నన్నుఁ బ్రోత్సహించి, నా యీశాస్త్రమునకు వన్నె పెట్టిన, గుంటూరు హిందూకాలేజి హైస్కూళ్ళ ప్రిన్సిపాల్ –

భగవద్గీతను సంస్కృతమునందు గ్రహింపఁజాలని తెలుఁగుపాఠకులకు ఈపొత్తము, ఎక్కువ యుపయోగకరము గావించుటకుఁ, దద్జ్ఞులగు నాప్తులు చేయు సూచనలు రాఁబోవు ముద్రణములందు నిముడ్పఁబడును.

పెద్ద లీపొత్తమునందలి భ్రమ ప్రమాద జనిత దోషంబులను మన్నించి, గుణలేశమున్న నాదరించి, నన్నుఁ బ్రోత్సహింతురుగాక యని వారల సవినయముగఁ బ్రార్థించుచున్నాఁడను. దృష్టాదృష్ట సూక్ష్మసూక్ష్మేతర స్ఖాలిత్య నివారణమునకుఁ బునర్ముద్రణమేగదా శరణ్యము.

కొన్ని ప్రత్యేక పదముల కర్థముల నిచ్చుచు, లఘుటిప్పణి యొకటి పుస్తకానుబంధముగాఁ జేర్పఁబడినది. ఈ టిప్పణము రాఁబోవు ముద్రణములందు, అవసరమును బట్టి, పెంచఁబడును.

గుంటూరు, ఇట్లు, విద్వజ్జనవిధేయుఁడు,
3 118, బ్రాడిపేట (తిలక్ పేట) మయిలవరపు వేంకటరామయ్య,
27-7-1939 గ్రంథకర్త.

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

శ్రీ

# బగవద్గీతానువాదము

## మొదటి యధ్యాయము.

### అర్జున విషాద యోగము.

ధృతరాష్ట్రుఁ డిట్లు పల్కెను :

ఆ॥ వె॥ అవని, ధర్మభూమి ♦ యై తనర్చెడి కురు-
క్షేత్రమందు రణరుచి ♦ కీర్షలగుచుఁ
గూడియున్న మామ ♦ కులుఁ, బాండవేయులున్,
సంజయా ! యింకేమి ♦ సల్పిరయ్య॥ 1

సంజయుఁ డిట్లు పల్కెను :

తే॥ గీ॥ అధిపుఁడైన సుయోధనుఁ ♦ డపుడు గాంచె
వ్యూహముగఁ దీర్చిన పాండ ♦ వుల బలంబు;
గాంచి, యాచార్యునిన్ సమీ ♦ పించి, యిట్లు
పల్కఁ దొడఁగెను వినవె, భూ ♦ పాలమౌళి ! 2

తే॥ గీ॥ "నీదు శిష్యుండు, ద్రుపద భూ ♦ నేతృసుతుఁడు,
బుద్ధిమంతుండు, మొగ్గరం ♦ బుగ నమర్చి
యెదుట నిల్పిన పాండవ ♦ పృథులసేన
చక్కఁగాఁ జూడఁగదవె, యా ♦ చార్యవర్య ! 3

తే॥ గీ॥ "అందుఁగల, రాహవమున భీ ♦ మార్జునులకు
సాటియగు శూరులౌ మహే ♦ ష్వాసు, లనఘ!
మహితశౌర్యుండు సాత్యకి, ♦ మత్స్యవిభుఁడు,
నృపవరుఁడు మహారథుఁడగు ♦ ద్రుపదరాజు,

తే॥ గీ॥ "చేదిపతి ధృష్టకేతుఁడు, ♦ చేకితానుఁ,
డలఘు బలవంతుఁడైన కా ♦ శ్యవనివిభుఁడు,
పురుజితుఁడు, కుంతిభోజప్ర ♦ భుండు, పురుష
వల్లభుండగు శైబ్య భూ ♦ వల్లభుండు,

తే॥ గీ॥ "మఱి, యుధామన్యుఁడు పరాక్ర ♦ మప్రభావుఁ,
డుత్తమౌజుండు ప్రకట బ ♦ లోన్నతుండు,
ద్రౌపదీతనూజులు, సుభ ♦ ద్రాసుతుండు,
వీరలెల్ల మహారథుల్, ♦ విప్రవర్య! 4, 5, 6

తే॥ గీ॥ "ఇంక, మనవారిలో ముఖ్యు ♦ లెవరు గలరొ,
తెలుపవలయును నీకిట, ♦ ద్విజవరేణ్య!
నాదుసైన్యంబులో నున్న ♦ నాయకులను
జ్ఞాపకార్థంబు చెప్పుచు ♦ న్నాఁడ వినుము: 7

కం॥ "తమరును, భీష్ముఁడుఁ, గర్ణుఁడు,
సమరవిజయుఁడైన కృపుఁడు, ♦ సంస్తుతఘన వి
క్రముఁ డశ్వత్థామయుఁ, భూ
మ్యమర! వికర్ణుఁడును, బాహ్లి ♦ కాధీశ్వరుఁడున్, *

---

* ఇది 'సౌమదత్తిస్తథైవ చ' అను పాఠము ననుసరించుచున్నది.

క॥ "మఱియు, ననేకు లిటుల నా
కొఱకై తమ ప్రాణములను ♦ గోల్పోవఁగ, సం
గరమునకు సిద్ధపడి,రం
దఱును ననేకాస్త్రశస్త్ర ♦ తతిగల నిపుణుల్॥ 8, 9

తే॥ గీ॥ "భీష్మరక్షితమ్మై యిట్టి ♦ వీరులు గల
అస్మదీయ బలం బప ♦ ర్యాప్తము సుమీ;
భీమరక్షితమ్మె, యో ధ ♦ రామరేంద్ర!
అరిబలంబది పర్యాప్త ♦ మయ్యె, వింటె॥ 10

తే॥ గీ॥ "కనుక, మీరలు వ్యూహమా ♦ ర్గములనెల్ల
నియమితస్థానములయందు ♦ నిలిచియుండి,
కావవలయును భీష్ము నో ♦ కౌరవుని లెస్స,
యెల్లవారును మీమీ య ♦ హీనశక్తి"॥ 11

తే॥ గీ॥ అపుడు భవదీయసుతునకు ♦ హర్ష మొసఁగఁ,
గురుకులము పెద్ద, శౌర్యయు ♦ క్తుండు, తాత,
తద్ద గొంతెత్తి సింహనా ♦ దంబుచేసి,
తనదు శంఖంబు పూరించె, ♦ ధారుణీశ! 12

తే॥ గీ॥ అంత, శంఖముల్, భేరులు, ♦ నానకంబుల్,
ఉడుకలును, గోముఖంబు, లొ ♦ క్కుమ్మడిగను
భోరుమని మ్రోగసాగెను, ♦ భూమినాథ!
వాద్యసంజనితధ్వనుల్ ♦ సర్వ దిశల॥ 13

తే॥ గీ॥ పిదప, శ్వేతాశ్వయుక్తమై ♦ పెద్దదైన
అరదమునయందు నుపవిష్టు ♦ లై రహించు
మాధవుండును, పాండవ ♦ మధ్యముండును,
సరవి నూదిరి తమ దివ్య ♦ శంఖములను॥ 14

తే॥ గీ॥ పరమపురుషుండు పూరించెఁ ♦ బాంచజన్య,
మర్జునుం డూదె దేవద ♦ త్తాఖ్యశంఖ,
ముగ్రకర్ముఁడు పవనజుం ♦ డూదెనంతఁ
బౌండ్రమను గొప్పశంఖంబు, ♦ పార్థివేంద్ర ! 15

తే॥ గీ॥ ధరణిపతికుంతిపుత్త్రుండు ♦ ధర్మసుతుఁ, డ
నంతవిజయంబు పూరించె, ♦ నాంబికేయ !
నకులసహదేవు లూది, రా ♦ ర్యకులముఖ్య !
తమ సుఘోషము మణిపుష్ప ♦ కములను, వరుస। 16

తే॥ గీ॥ ఉరుధనుర్ధరుఁడైన కా ♦ శ్యుర్వరేశుఁ,
డలమహారథగణగణ్యుఁ ♦ డౌ శిఖండి,
ద్రుపదపతిపుత్త్రుఁడు, విరాట ♦ నృపవరుండు,
సమరదుర్జయుఁడైనట్టి ♦ సాత్యకియును,

తే॥ గీ॥ ద్రౌపదేయులు, పాంచాల ♦ ధరణివిభుఁడు,
ప్రకటభుజవీర్యనిధిసుభ ♦ ద్రాసుతుండు,
మొదలుగాఁగల పాండవ ♦ ముఖ్యులెల్ల
ఒనరఁ దమతమ శంఖంబు ♦ లూదిరంత॥ 17, 18

ఆ॥ వె॥ శంఖఘోషజనిత ♦ సంకులారావంబు
భూమి, నభము, మారు ♦ మ్రోగఁజేసె ;
ధృతి నడంగఁద్రొక్కి, ♦ ధృతరాష్ట్రసూనుల
గుండియలను బగులఁ ♦ గొట్టసాగె॥ 19

తే॥ గీ॥ శంఖరవములు ముగిసి, శ ♦ స్త్రప్రయోగ-
మది ప్రవర్తిల్లఁ బోవుడి ♦ యవసరమున,
రణసముద్యుక్తులౌ ధృత ♦ రాష్ట్ర సుతుల
ఆంజనేయధ్వజుండగు ♦ నర్జునుండు,

తే॥ గీ॥ అల్లనం జూచి, విలుఁబూని ♦ యంతలోన,
యిట్లు చెప్పంగఁదొడఁగె శ్రీ ♦ కృష్ణుతోడ :
"దురము మొదలిడఁబోవు ని ♦ ద్విగణములను,
వీరలెవ్వారితోడ, నేఁ ♦ బోరఁదగునొ,

తే॥ గీ॥ "అట్టి యుద్ధసముల్లాసి ♦ తాత్ములైన
వారి, బాగుగఁ జూడనౌ ♦ దూరమందు,
ఉభయసైన్యంబులకు మధ్య ♦ నుంచుమిట్లు,
నాదు రథమును నిల్పవే, ♦ యాదవేంద్ర ! 20,21,22

ఆ॥ వె॥ "దుష్టబుద్ధియైన ♦ దుర్యోధనునకు, నీ
సమరమందుఁ బ్రియము ♦ సల్పఁగోరి,
యెట్టియెట్టి యోధు ♦ లిటఁజేరి యున్నారొ,
వారినెల్లఁ జూడఁ ♦ గోరువాఁడ"॥ 23

సంజయుఁ డిట్లు పల్కెను :

తే॥ గీ॥ భరతవంశప్రదీపక ! ♦ పాండవేయుఁ
డిట్లు చెప్పంగ విని హృషీ ♦ కేశుఁ డపుడు,
నరుని రథమును రెండుసై ♦ న్యముల నడుమ,
శాంతనవ కుంభసంభవ ♦ సముఖమందు,

తే॥ గీ॥ నిఖిలనృపతులయెదుటను, ♦ నిల్పి, " పార్థ !
యుద్ధసన్నద్ధులై కూడి ♦ యున్న సకల
కౌరవానీక నివహముం ♦ గాంచు మింక,"
అనుచుఁ దాఁ బల్కెఁ బాండునం ♦ దనునితోడ॥ 24, 25

ద్విపద॥ నరుఁ డందుపైని, సై ♦ న్యంబుల రెంటిఁ
బరికించి, యచట నిల్వఁ ♦ బడిన తండ్రులను,

ద్విపద॥ తాతల, గురుల, భ్రా ♦ తల, నాత్మజులను,
మాతులులను, మను ♦ మలను, మిత్రులను,

ద్విపద॥ మామల, సుహృదుల, ♦ మఱి, సంప్రహార
భూమి నిల్చిన చుట్ట ♦ ములనెల్లఁ జూచి, 26, 27

ద్విపద॥ పరమైన కృపచేతఁ ♦ బరవశుం డగుచు,
గురువిషాదంబు గీ ♦ ల్కొని, యిట్లు పలికె :

ద్విపద॥ " సమరంబు సల్పెడి ♦ సన్నాహమునను
సమకూడి యున్నట్టి ♦ స్వజనముం గాంచి, 28

ద్విపద॥ "సడలుచున్నవి నాదు ♦ సర్వాంగములును;
ఎడపక నాదు నో ♦ రెండంగసాగె;

ద్విపద॥ "ఒడలియందుం, గంప ♦ ముదయించుచుండె;
పొడముచున్నవి మేనఁ ♦ బులకాంకురములు॥ 29

ఆ॥ వె॥ "గాండివంబు చేతి ♦ నుండి జాఱఁబోవంగఁ;
దాప మెత్తుచుండెఁ ♦ దనువునందు;
నిలువఁజాలకుంటి ♦ నే, నరనంబున;
బ్రమయునట్లు కానఁ ♦ బడుమనంబు॥ 30

ఆ॥ వె॥ "అశుభసూచకంబు ♦ లగు నపశకునముల్-
గూడఁ, జూచుచున్న ♦ వాఁడఁ, గృష్ణ!
బంధుజనుల నాహ ♦ వంబునఁ జెగఁగాన్చి
కాంచు శ్రేయ మెదియొ ♦ గాంచలేను॥ 31

తే॥ గీ॥ "పూతచారిత్ర! విజయంబు ♦ పొందఁగోరఁ;
గోరరాజ్యమ్ము; సుఖములుం ♦ గోరఁబోను;
రాజ్యమును, భోగములు, మఱి, ♦ బ్రతుకునైన
నేమిలాభంబు నొసఁగూర్చు, ♦ నోమురారి! 32

తే॥ గీ॥ "జగతి, రాజ్యంబు, భోగముల్, ♦ సౌఖ్యములును,
ఎవరికొఱకయి పడయంగ ♦ నెంచుచుందు,
మట్టిబంధులు సంగర ♦ మందుఁ బ్రాణ
ములును, ధనములుఁ, గోల్పోవ ♦ నిలిచిరకట॥ 33

కం॥ "గురువులు, పితరులు, పుత్త్రులు,
మఱియుఁ, బితామహులు, మేన ♦ మామలు, మామల్,
మఱఁదులు, బావలు, మనుమలు,
మఱి, సంబంధులును బెక్కు ♦ మంది గలరిటన్॥ 34

కం॥ "వీరు నన్నుఁ జంపనున్నన్,
వీరల, నల త్రిజగదేక ♦ నేతృత్వము చే
కూరినను, జంపనొల్లను;
గోరుదునే యొక్క నేల ♦ కొఱకటు సేయన్॥ 35

తే॥ గీ॥ "ధార్తరాష్ట్రాద్యనేక బాం ♦ ధవులఁ జంపి,
యేమి సంప్రీతి గననేర్తు ♦ మీధరిత్రి?
ఆతతాయులె యగువీరి, ♦ హత మొనర్ప,
మనను బాతకమే చుట్టు ♦ కొనునుగాదె॥ 36

తే॥ గీ॥ "కాన, బాంధవసహితులౌ ♦ కౌరవులను
జంపఁ జూచుట మనకు శ్రే ♦ ష్ఠంబుగాదు;
స్వజనులగు వారిఁజంపి, యీ ♦ జగతియందుఁ
బడయఁగల సౌఖ్యమెదియో యే ♦ ర్పడఁగఁ జెపుమ॥ 37

తే॥ గీ॥ "ధార్తరాష్ట్రులు లుబ్ధచే ♦ తస్కులగుచు
వంశవిధ్వంసకృతదోష ♦ భరముగాని,
స్నేహితద్రోహ పాతక ♦ స్పృష్టిగాని,
తెలియఁగ లేకున్న లేకపో ♦ యెదరు; గాని,

తే॥ గీ॥ "కులవినాశంబువలన నె ♦ క్కొ-నెడి దోష
మంతయును లెస్సఁగనెఱుంగు ♦ నట్టి మనము
ఇట్టి పాపంబునందుండి ♦ యేలతొలఁగఁ
జాలమో, యది తెలియంగఁ ♦ జాలనైతి॥ 38, 39

కం॥ "కులమునశింప, సనాతన
కులధర్మములెల్లఁ జెడును; ♦ గులగత ధర్మం
బులు నాశమైనవేళం,
గులమె యధర్మంబు పాల ♦ గుఁ మొదలంటన్॥ 40

తే॥ గీ॥ "కుల మధర్మంబు పాలౌట ♦ వలనఁ, గృష్ణ!
చెడుదురు కులంబునందలి ♦ స్త్రీజనములు;
స్త్రీలు చెడిపోదురేని, వృ ♦ ష్ణికులదీప!
వర్ణసాంకర్యము సముద్భ ♦ వంబుగాంచు॥ 41

తే॥ గీ॥ "కులముఁ జెఱచినవారికిం, ♦ గులమునకును,
నరకసంప్రాప్తియే పరి ♦ ణామ మగును;
వారి పితరులు శ్రాద్ధ త ♦ ర్పణము లెవియు
లేక నరకంబులోనె కూ ♦ లెదరుగాదె॥ 42

ఆ॥ వె॥ "కుల వినాశకార ♦ కుల, యిట్టి వర్ణసాం
కర్యజనకదోష ♦ కలనచేత,
శాశ్వతంబులైన ♦ జాతిధర్మంబులున్,
వంశధర్మములును ♦ నాశమగును॥ 43

ఆ॥ వె॥ " వంశధర్మములను ♦ ధ్వంసమ్ము చేసిన
మానవులకు నియత ♦ మైన విధిని
నరక దుర్నివాస ♦ భరము నిశ్చయమంచుఁ
బెద్ద, లనువదింప, ♦ వినమె మనము ? 44

ఆ॥ వె॥ " అకట ! రాజ్యసుఖము ♦ లం దాదవిన లోభ
మునను, స్వజనము లను ♦ మనమె చంపి,
అమితమైన పాత ♦ కము నొడికట్టంగ,
సిద్ధపడితి, మిది వి ♦ రుద్ధమనక॥ 45

ఆ॥ వె॥ " ఆయుధముల వీడి ♦ యప్రతీకారుండ
నైన నను, సుయోధ ♦ నాదు లిందు
శస్త్రపాణులగుచుఁ ♦ జంపుదు రేనియు,
అదియె మిపుల క్షేమ ♦ మగును నాకు "॥ 46

సంజయుఁ డిట్లు పల్కెను :

తే॥ గీ॥ పాండవేయుండు దానిట్లు ♦ పలికి, శోక
సంచలితమానసుండౌచు, ♦ సశరమైన
చాపమునుఁ గ్రిందఁ బడవైచి, ♦ సంప్రహార
రంగమునఁ, గూలఁబడెఁ దన ♦ రథమునందు॥ 47

ఇది " భగవద్గీతానువాదము " నందలి
'అర్జున విషాదయోగ ' మను
మొదటి యధ్యాయము
సంపూర్ణము.

మయిలవరపు వేంకటరామయ్య,
వింజమూరి చిన్నసుబ్బారావు.

శ్రీ

# భగవద్గీతానువాదము

## రెండవ యధ్యాయము.

### సాంఖ్య యోగము

సంజయుఁ డిట్లు పల్కెను :

తే॥ గీ॥ అట్లు, హృదిని గృపావేశ ♦ మావహిల్ల,
అశ్రువుల్ నేత్రయుగ్మంబు ♦ నంటనిండ,
వ్యాకులేక్షణములఁ, జెల్గు ♦ వగచుచున్న
పార్థుఁగని, పార్థసారథి ♦ పల్కెనిట్లు :

శ్రీ భగవానుఁ డిట్లు చెప్పెను :

తే॥ గీ॥ పామరజనంబుచేత సం ♦ భావ్యమగుచు,
అపయశస్కర, మస్వర్గ్య ♦ మైనయిట్టి
కశ్మలంబది, సమయము ♦ కానిసమయ
మందు, నెటనుండి దాపుర ♦ మయ్యెనీకు ? 2

తే॥ గీ॥ పురుషపుంగవ! క్లైబ్యంబు ♦ పొందఁబోకు;
మది నినుఁబోలువానికి ♦ సనుచితంబు;
తుచ్ఛ హృద్దుర్బలత్వంబు ♦ త్రోసివైచి,
లెమ్ము, యుద్ధమ్ముసేయ సి ♦ ద్ధమ్ముకమ్ము॥ 3

అర్జునుఁ డిట్లుపల్కెను :

తే॥ గీ॥ పుడమి, భీష్ముండు ద్రోణుండును ♦ బూజ్యులుగద;
అట్టివారలపై, సంప్ర ♦ హారమందు
శరములను వైచి, యెదురు సం ♦ గరముసేయు
నెట్లు సైపంగలాఁడ, (శ్రీ) ♦ కృష్ణ! చెపుమ॥ 4

అనఘ ! మహానుభావులగు♦నట్టిగురూత్తములన్ వధించు కం
టెను గడుమేలుగాదె ధర♦ణీస్థలి భైక్షముదింట యోచినఁ; ద
ద్ఘనమతు లొక్కవేళ ధన♦కాములెయైనను, నట్టివారిఁ దు
న్మిన, నిహమందె క్రోలుదును♦నెత్తుటఁ దోఁగినభోగజాలముల్ 5

కం॥ కన మిటమన కెది శ్రేష్ఠమొ;
మనమే గెలిచెదమొ, వారె ♦ మనల గెలుతురో;
అని నిలిచి, రెవరిఁ జంపినఁ
గననొల్లమొ బ్రతుకె, యట్టి ♦ కౌరవులెదుటన్॥ 6

తే॥ గీ॥ కృపణతాఽపహత సహజప్ర ♦ వృత్తితోడ,
నడుగుచున్నాఁడ ధర్మమా ♦ ర్గమున నిన్ను;
శ్రేయమేదో దానిఁదెల్పు ని ♦ శ్చితముగాఁగ;
శిష్యుఁడను, బ్రపన్నుఁడను, శా ♦ సింపునన్ను॥ 7

కం॥ అరిశూన్యతఁ, బరిపూర్ణతఁ,
బరఁగుమహీరాజ్య, మల్ల ♦ స్వారాజ్యంబున్,
దొరకియు, నింద్రియశోషణ
కరదుఃఖభరంబుఁ బాయు ♦ గతి నెఱుఁగఁగదా॥ 8

సంజయుఁ డిట్లు పల్కెను :

తే॥ గీ॥ అధిప ! శత్రుభయంకరుం ♦ డర్జునుండు
దా హృషీకేశుతో నివ్వి ♦ ధమునఁబలికి,
" ఆహవముసేయ, శ్రీకృష్ణ !" ♦ యనివచించి,
ఊరకుండెను, వింతపై ♦ ల్లొదవుపట్లు॥ 9

ఆ॥ వె॥ ఊరకిట్లుసేయ ♦ నుభయంబులకుమధ్యఁ
బరితపించుచున్న ♦ పార్థుఁగాంచి,
పరమపురుషుఁ డిట్లు ♦ పలుకంగఁదొడఁగెను
బరిహాసించుచున్న ♦ వానిఁబోలె॥ 10

శ్రీభగవానుఁ డిట్లు చెప్పెను :

(సాంఖ్య ఘట్టము)

తే॥ గీ॥ శోకపడుచుంటివి వశో ♦ చ్యులనుగూర్చి;
పలుకుచుంటివి పండిత ♦ వాక్యతతుల;
అసువు లెడసినవారికై, ♦ యసువులున్న
వారికై యును, శోకింపఁ ♦ బోరుబుధులు॥ 11

తే॥ గీ॥ నేనులేకుంటిననుటొక ♦ ప్డైనిలేను;
నీవునట్టులె; యట్లె యీ ♦ నిఖిలనృపులు;
ఉన్నమనమెల్లరమును, రా ♦ నున్నయప్డు
లేకపోవుదు మనుటయు ♦ లేనెలేదు॥ 12

తే॥ గీ॥ దేహి కిప్రస్తుతంబగు ♦ దేహమందు,
బాల్య యౌవన వార్థకా ♦ వస్థలట్లో,
అట్లె యితరశరీర సం ♦ ప్రాప్తికూడ;
జ్ఞానియగువాఁడు మోహంబు ♦ గాంచఁడిందు॥ 13

తే॥ గీ॥ పంచతన్మాత్రములతోడి ♦ స్పర్శములవి
శైత్యమును, నుష్ణమును, మరిఁ ♦ సౌఖ్యదుఃఖ
ములనిడుచు, రాకపోకలు ♦ గలిగి, యస్థి
రంబులగుటను, వానినో ♦ ర్వంగవలయు॥ 14

తే॥ గీ॥ సుఖము, దుఃఖము, సమబుద్ధిఁ ♦ జూడఁగల్గి,
యెవ్వఁడీస్పర్శములఁ జలి ♦ యింపఁబడఁడో,
అట్టి ధీరాత్ముఁడే గదా, ♦ యనఘచరిత!
అమృతపదవిని బొందంగ ♦ నర్హుఁడగును॥ 15

తే॥ గీ॥ ఉనికియదిలే దసద్వస్తు ♦ వునకుఁ, బార్థ!
లేమి సద్వస్తువున కునికి ♦ లేకయుంట;
సత్త్వసత్త్వమ్ము రెంటి ని ♦ శ్చయముగూడఁ,
దత్త్వవేత్తలచేత సం ♦ దర్శితంబు॥ 16

తే॥ గీ॥ అఖిల విశ్వంబు దేనిచే ♦ వ్యాప్తమయ్యె,
అట్టిసద్వస్తు వవినాశి ♦ యని యెఱుంగు;
మవ్యయంబైన యాసత్ప ♦ దార్థమునకు
నాశమొనరింప నెవరికిం ♦ దరముగాదు॥ 17

తే॥ గీ॥ అరయఁగఁ బ్రమాణములకు గో ♦ చరముగాక,
నాశరహితంబు, నిత్యంబు ♦ నౌశరీరి-
దాల్చునీమేను లెప్పుడో యం ♦ తంబుగాంచుఁ;
గాన, యుద్ధంబుసేయంగఁ ♦ బూను, మనఘ! 18

తే॥ గీ॥ ఆత్మ నెవ్వఁడు చంపెడి ♦ దనితలంచుఁ,
జంపఁబడుదానిగా నెంచు ♦ జనుఁ డెవండు,
వార లిరువురుఁ దెలియని ♦ వారె సుమ్ము;
చంపదది, చంపఁబడదది, ♦ సవ్యసాచి! 19

తే॥ గీ॥ పుట్టుఁ జెందదు; మరణంబుఁ ♦ బొందఁబోదు;
ఉండి మఱలనొకప్డు లే ♦ కుండఁబోదు;
అజము, నిత్యము, శాశ్వత, ♦ మాదిరహిత,
మది హతముగాదు, దేహంబు ♦ హతముగాఁగ॥ 20

తే॥ గీ॥ అజము, నిత్యము, శాశ్వత, ♦ మవ్యయంబు
టంచు నెవ్వఁడు తెలియు నీ ♦ యాత్మ, నట్టి
మనుజుఁ డొకనినిజంపించు ♦ ననుటయెట్లు?
లాతఁ డొకనిని దాఁజంపు ♦ ననుటయెట్లు? 21

తే॥ గీ॥ జీర్ణ వస్త్రంబులను విస ♦ ర్జించి నరుఁడు
క్రొత్తవాని, వేఱింటిఁ, గై ♦ కొనెడిరీతి,
శిథిలదేహంబులఁ బరిత్య ♦ జించి, వేఱు
తనువులం గ్రొత్తలగువానిఁ ♦ దాల్చునాత్మ॥ 22

కం॥ ఈయాత్మను నఱుకఁగ లే
వాయుధములు; కాల్పఁజాల ♦ దనలంబేనిన్;
దోయములు తడుపఁ జాలవు;
వాయు వశక్తంబు శుష్క ♦ పఱుపఁగ దీనిన్॥ 23

కం॥ ఇది నఱుక నలవిగానిది;
యిదియట్టులె, కాల్పఁ, దడుప, ♦ నెండింపఁగ రా
నిది; యియ్యది నిత్యము, స
ర్వదిశాగత, మచల, మాది ♦ రహితము, స్థిరము॥ 24

కం॥ వినుమియ్యది యవ్యక్తం
బు, నచింత్యము, నిర్వికార ♦ మును; గావున, దీ
నిని నీవిట్టుల నెఱిఁగిన,
అనుతాపముఁ జెందుటది స ♦ ముచితమగునే? 25

ఆ॥ వె॥ అనఘ! యొకవేళ, ♦ నాత్మవస్తువు, సదా
జ్జన్మమొందుచుండి ♦ చచ్చుచుండు-
ద్దానిఁగాఁదలంతు ♦ వేని, నయ్యెడఁగూడ,
వగపుఁజెంద నీకుఁ ♦ దగవుగాదు॥ 26

ఆ॥ వె॥ ఎట్టులనఁగ: జగతిఁ ♦ బుట్టిన మనుజుండు
గిట్టుటది ధ్రువంబు; ♦ గిట్టువాఁడు
పుట్టుటయు ధ్రువంబె; ♦ యిట్టుల నెట్టన
జరుగుదానికై వి ♦ చారమేల? 27

ఆ॥ వె॥ భూతకోటి పుట్టు ♦ పూర్వమవ్యక్తంబు;
వ్యక్తమద్ది మధ్య ♦ మందె, పార్థ!
మరణమైనపిదప ♦ మఱల నవ్యక్తంబ;
యిట్టి విషయమందు ♦ నేడ్పులేల-? 28

ఆ॥ వె॥ ఆత్మనొకఁడు వింత ♦ యైనదానిఁగాఁ జూచుఁ,
బలుకు నొకఁడు వింత ♦ వస్తువట్లు,
వినునొకండు దీని ♦ వింతయైనదానిఁగా,
వినియు దీనిఁ దెలిసి ♦ కొనఁడెవండు॥ 29

తే॥ గీ॥ అఖిల భూతాళి తనువుల ♦ యందుఁ గలుగు
నాత్మ యెల్లప్పుడును నవ ♦ ధ్యంబెసుమ్మ;
కనుక, భూతంబుల వినాశ ♦ మునుగుఱించి
వగపుఁ జెందుటయది నీకుఁ ♦ దగవుగాదు॥ 30

తే॥ గీ॥ ఇంతెగాక, స్వధర్మంబు ♦ నెంచియైన
సంచలింపనియది ప్రశ ♦ స్తంబు నీకు;
ధర్మసంయుతమైన యు ♦ ద్ధంబుకన్నను
శ్రేయ మితరంబు లేదు క్ష ♦ త్రియున కిలను॥ 31

తే॥ గీ॥ తివురకయె, దైవికముగఁ బ్రా ♦ ప్తించినదయి,
స్వర్గమునయందుఁ దెఱచిన ♦ ద్వారమనఁగ
ఒప్పియుండెడి యిటువంటి ♦ యుద్ధమునకుఁ
బాలుగొను క్షత్రియులు సుఖ ♦ వంతులరయ॥ 32

తే॥ గీ॥ మఱియు, నీధర్మవిహితసం ♦ గరమునందుఁ
బాలుగొనకుందువేనిఁ, దత్ ♦ పతనమందు,
ఒకటవరుస స్వధర్మ, మిం ♦ కొకటవరుసఁ
గీర్తి, కోల్పోయి పొందెదు ♦ కిల్బిషంబు॥ 33

తే॥ గీ॥ ఇంతియేగాక, చిరకాల ♦ మెల్లప్రజలు
చెప్పుకొనుచుందు రీదు దు ♦ ష్కీర్తి, పార్థ!
గౌరవముతోడ బ్రతికిన ♦ పూరుషునకుఁ
జావుకంటెను నపకీర్తి ♦ లావుగాదె॥ 34

తే॥ గీ॥ భయమువలన నితం డాహ ♦ వంబునుండి
జారెనంచుఁ దలంత్రు మ ♦ హారథులిఁక;
ఎవరు నిను గౌరవించిరో ♦ యింతవఱకు,
వారె యిఁకఁ జుల్కఁ జేయంగ ♦ లారునిన్ను॥ 35

తే॥ గీ॥ సమయ మిదె చిక్కెనంచు నీ ♦ శత్రుకోటి
నీదుశక్తిసామర్థ్యముల్ ♦ నిందచేసి,
పలుకఁగల దనరాని మా ♦ టలును బెక్కు;
లింతకంటెను దుఃఖమిం ♦ కేమిగలదు? 36

తే॥ గీ॥ చంపఁబడుదేనిఁ బొందెదు ♦ స్వర్గసుఖము;
పృథివిఁ గ్రోలెదు నీవె జ ♦ యింతువేని;
అందుచే, నిఁకలెమ్ము, పృ ♦ థాత్మజాత!
యుద్ధమొనరింపఁ గృతనిశ్చ ♦ యుండవగుచు॥ 37

కం॥ వినుమీ: సుఖంబుదుఃఖం
బును, మఱి, లాభంబు నష్ట ♦ మును, జయ మజయం
బును, సమముగఁ గని, యుద్ధం
బునకై పూను, మటులైనఁ ♦ బొంద వఘంబుల్॥ 38

( సాంఖ్య యోగ విభాగవాక్యము )

తే॥ గీ॥ కలిపినాఁడ నిందనుక సాం ♦ ఖ్యంపు బుద్ధి;
యింకపైఁ జెప్పెదను: బుద్ధి ♦ యెట్టిదైనఁ
గర్మబంధంబు విడువంగఁ ♦ గలవొ, యట్టి
యోగబుద్ధిని; వినఁగద ♦ వోయి, పార్థ! 39

( యోగ ఘట్టము )

కం॥ మొదలిడిన వమ్ము లేదిటుఁ;
దుదముట్టకభగ్నమైన ♦ దోషము లే; దిం
పెదియేని స్వల్పకృషియును,
దుదిని మహాభయమునుండి ♦ తొలఁగించునరుల॥ 40

తే॥ గీ॥ అనఘ! యిట, నిశ్చయాత్మక ♦ మైనబుద్ధి
యేకమై యుండవలయు; న ♦ నేక భేద
యుతములై, యంతు గానక ♦ యుండుఁగాదె
మనసునిశ్చయమది లేని ♦ జనులమతులు॥ 41

ఆ॥ వె॥ వేదవాదరతులు, ♦ వేఱొద్ది లేదని
వాదమాడువారు, ♦ స్వర్గపరులు,
కామపూరితాత్ము ♦ లౌ మందబుద్ధులు,
భోగసంపదలను ♦ బొందుకొఱకు,

ఆ॥ వె॥ పలుక్రియావిధాన ♦ ములఁ జెప్పునదియును,
జన్మకర్మఫల మొ ♦ సంగునదియు,
సుమచయంబుఁ బోలి ♦ రమణీయమునునగు
వాక్యజాలమెద్ది ♦ పలుకుచుందు),

ఆ॥ వె॥ అట్టి వాక్యసరణి ♦ నపహృతచిత్తులై
సౌఖ్య సంపదలఁ బ్ర ♦ సక్తులగుచు
మసలు నజ్ఞులకు స ♦ మాధిని సుమరంగఁ
బొదు నిశ్చయాంపు ♦ బుద్ధి, పార్థ ! 42,43,44

తే॥ గీ॥ వేదములకుఁ ద్రైగుణ్యమే ♦ విషయ, మనఘ!
యీవొ, త్రైగుణ్యమును దరి ♦ యించి, ద్వంద్వ
ములనుపీడి, యోగక్షేము ♦ ములను దొఱఁగి,
సతతసత్త్వస్థమతి, నాత్మ ♦ రతుఁడవగుము॥ 45

తే॥ గీ॥ ఎందుఁజూచిన నీటి స ♦ మృద్ధిగలుగ,
బావియొకదానఁ గల్గు లా ♦ భం బదెంతొ,
అఖిలవేదప్రయోజన ♦ మంతెసుమ్ము
నిశ్చితార్థంబు నెఱుఁగు జ్ఞా ♦ నికి, గుణాఢ్య! 46

తే॥ గీ॥ కర్మమునయందె నీకధి ♦ కారమరయ;
ఫలములందది యెన్నఁడుఁ ♦ వలదునీకుఁ;
గర్మఫలకారణుండవు ♦ కాకుమనుము;
మాను మాసక్తికర్మముల్ ♦ మానుటందు। 47

తే॥ గీ॥ యోగముననిల్చి, యాసక్తి ♦ నుడుగఁజేసి,
కర్మఫలసిద్ధి గల్గినఁ, ♦ గల్గకున్న
సముఁడవై యుండి కర్మముల్ ♦ సల్పుచుండు;
మీ సమత్వమె యోగమం ♦ చెన్నఁబడును॥ 48

తే॥ గీ॥ కర్మమనునది బుద్ధియో ♦ గంబుకంటెఁ
జాలఁదక్కు-వగద, బుద్ధి ♦ జనితమగుట;
అందుచే, బుద్ధియోగంబు ♦ నాశ్రయింపు;
మల్పులుగదా ఫలాసక్తు ♦ లైనజనులు॥ 49

తే॥ గీ॥ బుద్ధియోగంబుగలవాఁడు ♦ పుణ్యపాప
కర్మముల రెంటిని జయింపఁ ♦ గలుగునిచట;
కనుక, నాయత్తపడుము యో ♦ గంబుకొఱకుఁ;
గర్మములఁ జేయునేర్పె యో ♦ గమ్మనుమ్మ॥ 50

తే॥ గీ॥ బుద్ధియోగంబునందుండు ♦ బుధజనంబు
కర్మజంబగు ఫలమందుఁ ♦ గాంక్షవదలి,
జన్మబంధంబు విడువంగఁ ♦ జాలి, తుదకు,
దుఃఖవిరహిత మోక్షము నొం ♦ దుదురు, పార్థ! 51

తే॥ గీ॥ మోహమాలిన్యమును నీదు ♦ బుద్ధియెపుడు
దాఁటనేర్చునో, యపుడె పొం ♦ దఁగలవీవు
విన్నభావంబునందును, ♦ వినఁగలట్టి
భావమందును, బూర్ణమౌ ♦ నేవగింపు॥ 52

ఆ॥ వె॥ వేదవాక్యతతుల ♦ వికలత్వమొందిన
నీదు బుద్ధియెపుడు ♦ నిలుకడమొయి
అచలముగ సమాధి ♦ యందుండఁగల్గునో
అట్టితఱిని యోగ ♦ మందఁగలవు॥ 53

అర్జునుఁడిట్లు ప్రశ్నించెను :

తే॥ గీ॥ రహి, సమాధిస్థుఁడౌ స్థిత ♦ ప్రజ్ఞుఁ డెట్టి
లక్షణముచేతఁ దెలియంగ ♦ లాఁడు? కృష్ణ!
అట్టి స్థితబుద్ధి యెట్టుల ♦ వ్యవహరించు ?
ఎట్టిరీతిని గూర్చుండు? ♦ నేమిపొందు ? 54

శ్రీ భగవానుఁ డిట్లు చెప్పెను :

క॥ మనమునఁ గలట్టి కోరిక
లను సర్వమువీడి నిశ్చ ♦ లంబగుబుద్ధిన్
మనుజుఁ డెపుడాత్మయందే
తనివిగనునో యపుడుచనుస్థి ♦ త ప్రజ్ఞుఁడనన్॥ 55

తే॥ గీ॥ కలఁగదెవ్వని మనము దుః ♦ ఖములయందు,
ఆసఁజెందఁడెవండు సౌ ♦ ఖ్యములయందు,
భయము, క్రోధము, రాగ, మె ♦ వ్వనికి లేదొ,
అట్టి ముని తాస్థితప్రజ్ఞుఁ ♦ డనఁ జెలంగు॥ 56

తే॥ గీ॥ ఎవఁడు సర్వత్ర యభిమాన ♦ మెడసి, కాల
గతిని దత్తచ్ఛుభాశుభ ♦ ప్రతతిగాంచి,
సంతసింపఁడో, మఱి, యని ♦ ష్టంబుగనఁడో,
వానిబుద్ధి స్థిరత్వంబుఁ ♦ బడసెనంద్రు॥ 57

తే॥ గీ॥ పురుషుఁడెప్పుడు, కూర్మాంగ ♦ ములవిధాన,
ఇంద్రియార్థంబులందుండి ♦ యింద్రియముల
సర్వభంగుల మరలింపఁ ♦ జాలు, నపుడె
వానిబుద్ధి స్థిరత్వంబుఁ ♦ బడసెనండ్రు॥ 58

తే॥ గీ॥ ఇంద్రియంబుల కాహార ♦ మిడని యెడల,
బాహ్యవిషయాళి పురుషుని ♦ వదలిచనును;
అంతమాత్రాన, నభిలాష ♦ యది తొలంగ;
దదియు వదలును బరముఁ గ ♦ న్నట్టివాని॥ 59

తే॥ గీ॥ ఇంద్రియంబులను వివేకి ♦ యెవ్వఁడేని
నిగ్రహముసల్పుటకుఁ బ్రయ ♦ త్నించుచున్న,
అవియె బలవత్తరంబులై ♦ యతని మనసు
కర్షణము చేయుఁగద బలా ♦ త్కారముగను॥ 60

ఆ॥ వె॥ వాని నెల్లఁదన య ♦ ధీనతయందుంచి,
యోగినన్నుఁ గోరి ♦ యుండుసతత,
మెవని యింద్రియములు ♦ స్వవశంబులై యుండు,
వానిబుద్ధి స్థిరతఁ ♦ బడసె సంద్రము॥ 61

ఆ॥ వె॥ పూరుషుండు విషయ ♦ ములఁ గూర్చి ధ్యానింప,
విషయసంగ ముద్భ ♦ విల్లుదాన;
సంగ ముద్భవింప, ♦ జనియించుఁ గోరిక;
కోరికఁ గడ్డగలుగఁ ♦ గ్రోధ మొదవు॥ 62

ఆ॥ వె॥ పిదపఁ గ్రోధకలన ♦ నుదయించు మోహంబు;
మోహవశము చేతఁ ♦ బొడముమఱపు;
మఱపువలనఁ బుట్టు ♦ మతిబుద్ధినాశంబు;
తద్వినాశమునను ♦ దానె చెడును॥ 63

తే॥ గీ॥ యోగరతుఁడు, రాగద్వేష ♦ యుక్తిగనక,
ఆత్మవశగాములౌ నింద్రి ♦ యములచేత
ఎల్లవిషయంబులందుఁ జ ♦ రించుచుండి, *
మనసు స్వాధీనమౌట, ని ♦ర్మలత గాంచు। 64

తే॥ గీ॥ నిర్మలత్వంబుగన్న వా ♦ నికిన శేష
దుఃఖములు పటాపంచలై ♦ తొలఁగి చనును;
భావనైర్మల్యమెప్పుడఁ ♦ ద్వరితగతిని
బుద్ధి కుదిరికఁ జెంది యో ♦ ప్పాఁగద, పార్థ ! 65

ఆ॥ వె॥ యోగయుక్తిలేక ♦ యొదవదుస్థిరబుద్ధి;
ఆత్మచింతగూడ ♦ నాస్తియగును;
అట్టిచింతలేక ♦ యలవడునే శాంతి ?
శాంతిలేకయున్న ♦ సౌఖ్యమెచట ? 66

తే॥ గీ॥ ఇంద్రియంబులు చరియింప, ♦ నెట్టిచిత్త
మనుసరించునో వానినే, ♦ యద్ది నరుని
ప్రజ్ఞ హరియించుఁ జుమి, నీటి ♦ పైనిపడవ,
నేచువాయువు పెడదారి ♦ కీడ్చునట్లు॥ 67

తే॥ గీ॥ కనుకఁ, బర్యవసానము ♦ వినుము, పార్థ !
అఖిలవిధముల విషయంబు ♦ లందునుండి
యింద్రియంబులఁ, దా, నిగ్ర ♦ హించునెవఁడు
వానిబుద్ధి స్థిరత్వంబుఁ ♦ బడసెనంద్రు। 68

---

* ఎల్లవిషయంబులన్ జరి ♦ యించుచుండి,

ఆ॥ వె॥ ప్రాణికోటి కెల్ల ♦ రాత్రియె య్యది, దాని
యందు జాగరూకుఁ ♦ డౌను యోగి;
ప్రాణికోటి దేని ♦ యందు మేల్కాంచునో,
అద్ది రాత్రి, యెఱిఁగి ♦ నట్టి మునికి॥ 69

తే॥ గీ॥ అంతటను బూరితంబౌచు ♦ నచలమైన
వనధిలోనికి జలములు ♦ సొచ్చునట్లు,
అఖిలవిషయంబు లెవ్వని ♦ యందుఁ జేరు,
అతఁడెగను శాంతిఁ; గనఁడు కా ♦ మాభిలాషి॥ 70

తే॥ గీ॥ మనుజుఁ డెవ్వాఁడు కోర్కె-లె ♦ ల్లను దొలఁగి,
తగులుబాటదివిడి, మమ ♦ త్వంబు వదలి,
మఱి, యహంకారవర్జిత ♦ మానసుండయి,
జగతి వర్తించునో వాఁడె ♦ శాంతినొందు॥ 71

కం॥ వినుమిది బ్రాహ్మీస్థితి; యిది
యొనగూడిన నరుఁడు మోహ ♦ మొందం; డసువుల్
చనువేళనైన నిందుం
డినచో, నరుఁడొందు బ్రహ్మ ♦ నిర్వాణంబున్॥ 72

ఇది శ్రీ లక్ష్మీనరసమాంబా హనుమదార్య పుత్రి,
కవిజనవిధేయ, మయిలవరవంశీయ, వేంకటరామనామధేయ
ప్రణీతంబైన "భగవద్గీతానువాదము" నందలి
'సాంఖ్యయోగ' మను
రెండవ యధ్యాయము
సంపూర్ణము.



శ్రీ

# భగవద్గీతానువాదము

## మూఁడవ యధ్యాయము.

### కర్మయోగము, లేక, అనాసక్తి యోగము.

అర్జునుఁ డిట్లు ప్రశ్నించెను :

కం॥ జనవినుత ! కర్మమునకం
టెను బుద్ధియె శ్రేష్ఠమనుచు ♦ నీమతమైనన్,
నను ఘోరమైనకర్మం
బున నేల నియుక్తుఁజేయఁ ♦ బూనెదు ? కృష్ణా !

తే॥ గీ॥ వ్యామిళితముగఁదోఁచు వా ♦ క్యముల చేత,
నన్ను భ్రమపెట్టునట్లు క ♦ న్పట్టెదీవు;
దేనినూనిన, శ్రేయమొం ♦ దెదనొ నేను,
దాని నొకదానినే నిశ్చి ♦ తముగఁ జెపుమ॥

శ్రీ భగవానుఁ డిట్లు చెప్పెను :

తే॥ గీ॥ రెండు తెగలైన నిష్ఠలీ ♦ పృథివిఁ గలవు:
జ్ఞానయోగంబుచేతను ♦ సాంఖ్యులకును,
యోగులౌవారలకుఁ గర్మ ♦ యోగకలన;
ఇట్లు వచియించియుంటి, నే ♦ నిటకుమున్న॥

తే॥ గీ॥ మొదలె కర్మలొనర్పనిఁ ♦ బూనికచేతఁ,
బొందఁబోవఁడు నైష్కర్మ్య ♦ మును నరుండు;
మఱివినుము, కర్మసన్న్యాస ♦ మాత్రముననె,
పూరుషుఁడు సిద్ధిగాంచఁగఁ ♦ బోఁడు, పార్థ !

తే॥ గీ॥ కర్మ, మొకఁడప్పు, డొకక్షణ ♦ కాలమైన,
సల్పకుండనె నిలువంగఁ ♦ జాలఁడెవఁడు;
ప్రకృతిజన్యగుణంబులం ♦ బ్రతినరుండు
స్వవశముందప్పి కర్మంబు ♦ సల్పుచుండు॥ 5

తే॥ గీ॥ ఎవఁడు కర్మేంద్రియముల వ్యా ♦ పృతుల నడఁచి,
మనసుచే నింద్రియార్థచిం ♦ తన యొనర్చు,
అట్టి జ్ఞానవిమూఢాత్ముఁ ♦ డౌనరుండు
చనునుగాదె మిథ్యాచారుఁ ♦ డన ధరిత్రి॥ 6

తే॥ గీ॥ ఏనరుండు, మనస్సుచే, ♦ నింద్రియములఁ
దన యధీనతయందుంచు ♦ కొని, యసంగ
కలనఁ, గర్మేంద్రియములచేఁ ♦ గర్మయోగ
మందు వర్తించునో, శ్రేష్ఠుఁ ♦ డాతఁ, డనఘ ! 7

తే॥ గీ॥ నియతమైనట్టికర్మంబు ♦ నెఱపుమీవు;
కర్మ శ్రేష్ఠమ్ముసుమ్మి, య ♦ కర్మకంటె;
దేహయాత్రయు నడువని ♦ స్థితిఘటిల్లుఁ
గర్మములు మానివేయంగఁ ♦ గడఁగితేని॥ 8

తే॥ గీ॥ యజ్ఞమునకయిచేయు క ♦ ర్మళ్ళిగాక,
తక్కు-కర్మలు లోకబం ♦ ధకములగుట,
సంగము పరిత్యజించి, య ♦ జ్ఞమ్ముకొఱకు,
సల్పుచుండుము కర్మసం ♦ చయము తెస్స॥ 9

ఆ॥ వె॥ ఆదియందు బ్రహ్మ ♦ యజ్ఞంబుతోడుతఁ
బ్రజల సృష్టిచేసి ♦ పలికెనిట్లు :-
“ వృద్ధిఁబొందుఁడయ్య ♦ యిద్దానిచేనింక,
ఇష్టకామధేను ♦ విద్ది మీకు॥ 10

తే॥ గీ॥ “ దేవతలను భావింపుఁడు ♦ దీనిచేతఁ;
బిదప, వారలు మిమ్ము భా ♦ వించుచుంద్రు;
ఒకరినొక రిట్లు భావించు ♦ చుండు రేని,
ఉత్తమంబగు శ్రేయస్సు ♦ నొందఁగలరు॥ 11

ఆ॥ వె॥ “ యజ్ఞభావితాత్మ ♦ లాదేవతలు మీకు
ఇష్టభోగతతుల ♦ నీయఁగలరు;
వారొసంగువాని, ♦ వారి కింతేనీక
మెక్కువాఁడు, దొంగ ♦ నిక్కముగను”॥ 12

ఆ॥ వె॥ యజ్ఞశేషభోక్త ♦ లౌ సజ్జనులు, సర్వ
పాపచయవిముక్తిఁ ♦ బడయఁగలరు;
ఎవరు, తమనిమిత్త ♦ మే, పాకమొనరింత్రొ,
అట్టిపాపు లఘమె ♦ యారగింత్రు॥ 13

ఆ॥ వె॥ అన్నమునను బుట్టుఁ ♦ బ్రాణులు; పర్జన్య
వలన నన్న ముద్భ ♦ వంబుచెందు;
యజ్ఞమునను బ్రభవ ♦ మగును బర్జన్యుఁడు;
కర్మవలన యజ్ఞ ♦ కర్మమొదవు॥ 14

ఆ॥ వె॥ కర్మముద్భవంబు ♦ గాంచె బ్రహ్మమువల్ల;
అక్షరమునఁ బ్రభవ ♦ మయ్యె బ్రహ్మ;
మందుచేత, నెందు ♦ వ్యాప్తమౌ బ్రహ్మంబు
సతము యజ్ఞమందు ♦ సంస్థితంబు॥ 15

ఆ॥ వె॥ ఇట్లు నడుపఁబడిన ♦ యీ యజ్ఞచక్రంబు
ననుసరింపకుండు ♦ మనుజుఁ డెవఁడొ,
ఆ యఘాయు, వింద్రి ♦ యారాముఁ, డీ ధాత్రి,
వ్యర్థజన్ముఁ డనఁగ ♦ బ్రతుకుచుండు॥ 16

తే॥ గీ॥ ఆత్మయందె రతుండయి, ♦ యాత్మచేతఁ
దనివి చెందెడివాఁడయి, ♦ దానియందె
సతతసంతుష్టచిత్తుఁడౌ ♦ జనుఁ డెవండొ,
అట్టివానికి స్వీయ కా ♦ ర్యంబు లేదు॥ 17

తే॥ గీ॥ అట్టివానికి స్వార్థవ్య ♦ పాశ్రయంబు
ప్రాణులందెందు లేకునికి, ♦ అన్నరుండు,
కర్మ చేసిన స్వోపయో ♦ గంబు లేదు,
చేయకుండిన నింతయుఁ ♦ జేటుపు లేదు॥ 18

తే॥ గీ॥ కనుక, నాసక్తి విడిచిన ♦ మనసుతోడఁ
జేయఁదగినట్టి కర్మంబు ♦ చేయు మెపుడు;
సంగము త్యజించి కర్మంబు ♦ సల్పునెడలఁ
బురుషుఁ డుత్తమపదవిని ♦ బొందఁగలఁడు॥ 19

తే॥ గీ॥ కర్మచేతనె సంసిద్ధి ♦ గనిరిగాదె
జనకుఁ డాదిగఁగల్గు రా ♦ జన్యవరులు;
లోకసంగ్రహమే యైన ♦ లోఁదలంచి,
కర్మములఁ జేయుచుంట యు ♦ క్తమ్ము నీకు॥ 20

తే॥ గీ॥ శ్రేష్ఠుఁ డేదేది దా నాచ ♦ రించుచుండు,
అదియె యాచరణీయమౌ ♦ నన్యజనుల;
కాతఁ డెయ్యది యాదర్శ ♦ మనఁగఁ జూపు,
అదియె సామాన్యజనులెల్ల ♦ ననుసరింత్రు॥ 21

తే॥ గీ॥ చంద్రకులదీప! నాకు ము ♦ జ్జగములందుఁ
బడయునదియును, బడయంగ ♦ వలసినదియు,
సల్పఁదగినదియును లేదు, ♦ స్వల్పమేని;
అయినను, వర్తింతుఁగద కర్మ ♦ మందె నేను। 22

ఆ॥ వె॥ అనఘ! కర్మమందు ♦ నప్రమత్తుండనై
నిల్వకుంటినేని, ♦ నే సతమ్ము,
అఖిలవిధములన్ స ♦ మస్త ప్రపంచంబు
నాదుమార్గముననె ♦ నడుచుఁగాదె॥ 23

తే॥ గీ॥ ఒకట, నేఁ గర్మమొనరింప ♦ కుండు నేని
నాశముం గాంతు రీప్రజల్, ♦ నరవరేణ్య!
* గంద్రగోళంబునకు నేనె ♦ కర్తనౌదుఁ;
బ్రజలఁ, దుదకేనె, చెఱచిన ♦ వాఁడనౌదు॥ 24

* కర్తనౌదును నేనె సాం ♦ కర్యమునకుఁ;

తే॥ గీ॥ కర్మఫలసక్తులగుచు న ♦ జ్ఞానులెట్లు
కర్మములఁ జేయుచుందురో, అ ♦ క్కరణిజ్ఞాని,
ఫల మపేక్షింప కొనరింప ♦ వలయు, యుక్త
కర్మములనెల్ల లోకసం ♦ గ్రహముకొఱకు॥ 25

తే॥ గీ॥ బుద్ధిభేదంబుఁ బుట్టింపఁ ♦ బోల, దజ్ఞు
లైన కర్మప్రసక్తుల ♦ యందుజ్ఞాని;
సర్వకర్మాళిఁ దా యుక్తి ♦ సల్పుచుండి,
పామరులచేతఁ జేయింప ♦ వలయు, వాని॥ 26

తే॥ గీ॥ ప్రకృతి గుణములచేతఁ గ ♦ ర్మంబులెల్ల
సలుపఁ బడుచుండ, నా జాడ ♦ దెలియలేక,
మహి, నహంకార మూఢుఁడౌ ♦ మానవుండు
తానె కర్తనటంచుఁ జి ♦ త్తమున నెంచు॥ 27

తే॥ గీ॥ కాని, గుణకర్మముల విభా ♦ గమునఁగల్గు
తత్త్వమెఱిఁగినవాఁడో, పృ ♦ థాతనూజ!
"గుణములు చరించుచుండుఁ బో, ♦ గుణములందు"
టంచు మదిఁగాంచి, యాసక్తి ♦ నందఁడెందు॥ 28

తే॥ గీ॥ ప్రకృతిగుణముల మోహావి ♦ భ్రాంతినెవరు
సక్తులగుదురో గుణకర్మ ♦ జాలమందు,
అట్టి యవివేకచిత్తులౌ ♦ నల్పమతుల
సంచలింపంగఁ జేయఁగాఁ ♦ జనదుజ్ఞాని॥ 29

తే॥ గీ॥ ఆత్మవిషయిక బుద్ధితో ♦ నఖిలకర్మ
సంచయమ్ము నా యందు ♦ సన్న్యసించి,
కోరికలవీడి, మమకార ♦ దూరుఁడవయి,
యుద్ధమొనరింపు, సంతాప ♦ యుక్తిఁగనక॥ 30

తే॥ గీ॥ ఎవరు నాయీమతంబు తా ♦ మెల్లయెడల
శ్రద్ధతోడ, ననాదర ♦ రహితులగుచు,
అనుసరింతురో, యట్టివా ♦ రును, కిరీటి!
కర్మబంధవినిర్ముక్తిఁ ♦ గాంచఁగలరు॥ 31

తే॥ గీ॥ ఎవరు నేఁజెప్పుచున్నట్టి ♦ యీమతంబు
ననుసరింప, రసూయాప ♦ రాత్ములగుచు,
అట్టి జ్ఞానవిమూఢుల, ♦ నల్పమతుల
నష్టులని యెంచవలయుఁబో, ♦ నరవరేణ్య! 32

తే॥ గీ॥ తనదుప్రకృతినై ఖలులకుఁ ♦ దగినయట్లు
జ్ఞానినై తము కర్మముల్ ♦ సల్పుచుండుఁ;
బ్రాణులెల్లను బ్రకృతినే ♦ యనుసరింత్రు,
దానిని నిరాకరింప సా ♦ ధ్యంబెయొందు? 33

తే॥ గీ॥ విను: ప్రతీంద్రియమునకుఁ, ద ♦ ద్విషయవితతి,
రాగమును ద్వేషమును రెండుఁ ♦ బ్రబలియుండు;
వానివశమునఁ బడఁగూడ ♦ దేనరుండు,
అవియె నరునకు శత్రువు ♦ లయ్య, పార్థ! 34

తే॥ గీ॥ మహిని, సమనుష్ఠితాన్య ధ ♦ ర్మంబుకంటె,
విగుణమయ్యు స్వధర్మంబె ♦ మిగులమిన్న;
మరణమేన్ శ్రేయమగు, స్వధ ♦ ర్మంబునందు;
అరయఁ, బరధర్మము భయావ ♦ హమ్ము సుమ్ము॥ 35

అర్జునుఁ డిట్లు ప్రశ్నించెను :

కం॥ సరి; దేనిచేతఁ బురుషుఁడు
పురికొల్పంబడు, చేనిష్ట ♦ ముగ నేనియుఁ, దాఁ
జరియించుచుండుఁ, బాపా
చరణమునం, దీడ్వఁబడిన ♦ చాడ్పునఁ? గృష్ణా! 36

శ్రీభగవానుఁ డిట్లు చెప్పెను :

కం॥ విను : కామము క్రోధం బిది,
జనియించు రజోగుణ ప్ర ♦ సారమువలనన్,
బెనుతిండిపోతు, పాపపు
గని; యిద్దాని నిటవైరి ♦ గా నెఱుఁగఁదగున్॥ 37

తే॥ గీ॥ నిప్పు పొగచేత నెట్టులఁ ♦ గప్పఁబడునో,
అద్ద మెట్టుల ధూళిచే ♦ నావృతమగు,
మావిచేతను శిశువెట్లు ♦ మఱుఁగుచెందుఁ,
గామమున, జ్ఞానమట్టులఁ ♦ గప్పఁబడును॥ 38

తే॥ గీ॥ తనివియే లేక, నింప సా ♦ ధ్యంబుగాక,
జ్ఞానియగువాని కెయ్యెడ ♦ శత్రువగుచుఁ
గోరు రూపంబులెల్లఁ గై ♦ కొనుచునుండు
కామమున, జ్ఞానమయ్యది ♦ కప్పఁబడియె॥ 39

ఆ॥ వె॥ వినవె : యింద్రియములు, ♦ మనసు, బుద్ధియు, దీని
కాశ్రయంపుస్థాన ♦ మనివచింత్రు;
దీనిచేత నిద్ది ♦ జ్ఞాన మాచ్ఛాదించి,
మోహపెట్టుచుండు ♦ దేహి, ననఘ! 40

తే॥ గీ॥ అందుచే, నింద్రియంబుల ♦ నాది నుండె
నిగ్రహముచేసి కామముఁ ♦ విడుము లెస్స;
కామ మది పాపనిలయంబు, ♦ కామమిద్ది
జ్ఞాన విజ్ఞాన సర్వవి ♦ నాశకారి। 41

ఆ॥ వె॥ అనఘ! యింద్రియంబు ♦ లవి బలిష్ఠములందు్రు;
ఇంద్రియములకంటె ♦ హెచ్చు మనసు;
మనసుకంటె బుద్ధి ♦ మఱిశ్రేష్ఠమైనది;
అంతకంటె నెక్కు ♦ డైనదాత్మ। 42

కం॥ ఇట్టుల బుద్ధికి మించిన-
యట్టి పదార్థంబు నెఱిఁగి, ♦ యాత్మ నయాత్మం
గట్టడనిడికొని, యోఁడని
దిట్టం, గామ మనురిపు, వ ♦ ధింపుము, విజయా! 43

ఇది శ్రీ లక్ష్మీనరసమాంబా హనుమయార్య పుత్త్రి,
కవిజన విధేయ, మయిలవర వంశీయ, వేంకటరామ నామధేయ
పరిణీతంబైన "భగవద్గీతానువాదము" నందలి
'కర్మయోగము, లేక అనాసక్తియోగ' మను
మూఁడవ యధ్యాయము
సంపూర్ణము.



శ్రీ

# భగవద్గీతానువాదము

## నాల్గవ యధ్యాయము.

## జ్ఞాన యోగము.

శ్రీ భగవానుఁ డిట్లు చెప్పెను :

తే॥ గీ॥ అవ్యయంబైన యీయోగ ♦ మాదియందుఁ
దెల్పి యున్నాఁడఁ జుమి నేను ♦ దినకరునకు;
దినకరుఁడు చెప్పె దానిని ♦ మనువునకును;
మను వదివచించె నిక్ష్వాకు ♦ మనుజపతికి! 1

తే॥ గీ॥ ఇట్టులఁ బరంపరాప్రాప్తి ♦ నెసఁగు దీని
నెఱిఁగి యుండిరి రాజర్షి ♦ వరులు మున్ను;
ఇప్పు డాయోగ మిల నశి ♦ యించిపోయెఁ
గాల మధికంబు గడచిన ♦ కారణమున॥ 2

తే॥ గీ॥ అల్లయోగంబె, ప్రాచీన ♦ మైన యదియె,
నాదు భక్తుండవును, సఖుం ♦ డవు, నటంచు,
నేఁడు నే వెల్లడించుచు ♦ న్నాఁడ నీకు;
ఉత్తమంబా రహస్య మీ ♦ యోగ మరయ॥ 3

అర్జునుఁ డిట్లు ప్రశ్నించెను :

ఆ॥ వె॥ ఈవు పుట్టినది, యి ♦ టీవలనే గదా;
రవియొ, నీకు మున్నె ♦ ప్రభవ మొందె;
అట్టి యెడను, నీవె ♦ యాదియం దిద్దానిఁ
బలికితనుట యెట్లు ♦ తెలియఁ గలను ? 4

శ్రీ భగవానుఁ డిట్లు చెప్పెను :

తే॥ గీ॥ నాకు నీకును, పార్థ ! యీ ♦ నాఁటివఱకుఁ
ఎన్నియో జన్మములు గతి ♦ యించియుండెఁ;
వాని నెఱుఁగుదునోయి ! స ♦ ర్వంబు నేను;
నీ వెఱుంగవు సుమ్ము, కుం ♦ తీ కుమార ! 5

తే॥ గీ॥ అజుఁడ నయ్యును, మఱి యవ్య ♦ యాత్మునయ్యుఁ,
ప్రాణిసందోహమునకు నీ ♦ శ్వరుఁడ నయ్యు,
స్వీయమైనట్టి ప్రకృతిని ♦ స్వీకరించి,
స్వేచ్ఛ, నామాయచే, జన్మ ♦ మెత్తుచుందు॥ 6

తే॥ గీ॥ ధర్మ మెప్పుడెప్పు డిలఁ బ్రమా ♦ దంబు చెందు,
ఎప్పు డెప్పు డధర్మంబు ♦ వృద్ధిగాంచు,
అట్టి యవసరమగు సమ ♦ యముల నెల్లఁ,
గోరి నను నేనె సృష్టించు ♦ కొందుఁ, బార్థ ! 7

తే॥ గీ॥ * సాధుజనముల రక్షణ ♦ సల్పుటకును,
దుష్టజన సంచయంబును ♦ ద్రుంచుటకును,
పృథివి, ధర్మంబు లెస్స స్థా ♦ పించుటకును,
యుగయుగంబునఁ బ్రభవించు ♦ చుందుఁ, బార్థ ! 8

* సాధుజన రక్షణంబును ♦ సల్పుటకును,

తే॥ గీ॥ జనుఁ డెవం డిట్లు నాదివ్య ♦ జన్మ కర్మ
ములను వాస్తవరీతిగాఁ ♦ దెలియఁ గలఁడొ,
అతఁడు దేహంబు త్యజియించు ♦ నవల, తిరిగి
జన్మ మొందక, ననుఁబొందు ♦ శాశ్వతముగ॥ 9

తే॥ గీ॥ భయము, క్రోధంబు, రాగంబు ♦ వదలివైచి,
నన్నె ప్రేమించి, నను శర ♦ ణంబు చొచ్చి,
జ్ఞానతపమున శుద్ధులై, ♦ నాదు భావ
మొందియుండి రనేకు లీ ♦ యుర్వియందు॥ 10

తే॥ గీ॥ ఎవ్వ రెట్టుల నను భజి ♦ యించుచుంద్రొ,
వారల ననుగ్రహింతు నా ♦ పథమునందె;
కాన, మనుజులు వివిధమా ♦ ర్గములచేత,
నాదు మార్గంబునవె సదా ♦ నడచుచుంద్రు॥ 11

తే॥ గీ॥ కర్మ ఫల సిద్ధియుందె కాం ♦ క్షనిడు వారు
కొల్చుచుందురు దేవతా ♦ కోటి నిలను;
గర్మభవ సిద్ధి మనుజలో ♦ కంబు నందుఁ
ద్వరితగతి గల్గుటది ప్రసి ♦ ద్ధమ్ము గాదె॥ 12

తే॥ గీ॥ మనుజ గుణ కర్మ భేదంబు ♦ లనుసరించి
నాల్గు వర్ణంబుల సృజించి ♦ నాఁడ నేనె;
కర్తనయ్యును దత్సృష్టి ♦ కార్యమునకు,
అవ్యయుఁడనౌ నకర్తనం ♦ చాత్మఁ గనుము॥ 13

తే॥ గీ॥ నన్నుఁ గర్మంబు లంటవు; ♦ నాకుఁ గర్మ
ఫలమునందలి యాసక్తి ♦ గలుగ దెందు;
ఇట్లు ననుఁగూర్చి యెఱుఁగున ♦ దెవఁడొ, యతఁడు
కర్మముల చేత నెన్నఁడుం ♦ గట్టు వడఁడు॥ 14

తే॥ గీ॥ పూర్వపు ముముక్షువులును నీ ♦ వుంత నెఱిఁగి
కర్మ మొనరించియుండిరి, ♦ గనుకఁ, బార్థ!
పూర్వులును, వారికంటెను ♦ బూర్వికులును,
సల్పియుండిన కర్మంబె ♦ సల్పు మీవు॥ 15

తే॥ గీ॥ కర్మమన నెద్ది, యెద్ది య ♦ కర్మ మనెడి
విషయమున భ్రాంతిపడుచుంద్రు ♦ విజ్ఞు లేని;
ఏట్టి కర్మ మ్మెఱింగి సం ♦ సృతి విముక్తిఁ
జెందెదవొ, యట్టి కర్మ వ ♦ చింతు నీకు॥ 16

తే॥ గీ॥ కలస్వరూపాన నెఱుఁగనౌ ♦ కర్మగతిని;
మఱి, వికర్మంబు నట్టులే ♦ యెఱుఁగ నగును;
దత్త్వరీతి నెఱుంగఁగాఁ ♦ దగు నకర్మ;
కర్మతత్త్వ మ్మెఱుంగ దు ♦ ష్కరము సుమ్ము॥ 17

తే॥ గీ॥ కర్మయందు, నకర్మంబు ♦ గను నెవండు,
కర్మమును గాంచు నెవ్వఁ డ ♦ కర్మమందు,
అతఁడె, నరులందు, ధీమంతుఁ, ♦ డతఁడె యోగి,
అఖిలకర్మల నొనరించి ♦ నట్టిఁ డతఁడె॥ 18

తే॥ గీ॥ అవని నెవ్వాఁడు సల్పు క ♦ ర్మాళి యెల్లఁ
గామసంకల్ప రహితమై ♦ గ్రాలుచుండు,
నట్టి జ్ఞానాగ్నిదగ్ధస ♦ మస్తకర్ముఁ
డైన పురుషుని "బండితుం" ♦ డండ్రు బుధులు॥ 19

తే। గీ। సతత సంతృప్తుఁడును, నిరా ♦ శ్రయుఁడు నైన
జనుఁడు కర్మ ఫలాసంగ ♦ మును ద్యజించి,
యెల్ల యెడలను గర్మప్ర ♦ వృత్తుఁ డయ్యు,
నింత యేనియుఁ జేయు న ♦ ట్లెంచఁబడఁడు। 20

తే॥ గీ॥ ఆసలందొలఁగి, నియత చి ♦ త్తాత్ముఁ డగుచుఁ,
ద్యక్త సర్వపరిగ్రహుఁ ♦ డౌ నరుండు
కేవల శరీర విషయక ♦ క్రియ యొనర్పఁ,
బొందఁ బోవఁడు కిల్బిషం ♦ బును, కిరీటి ! 21

తే॥ గీ॥ అప్రయత్నాప్త లాభతు ♦ ష్టాత్ముఁ డగుచు,
ద్వంద్వముల దాఁటి, విగత మ ♦ త్సరత గాంచి,
సిద్ధ్యసిద్ధుల సమబుద్ధిఁ ♦ జెలఁగువాఁడు
కర్మ మొనరించియును, దానఁ ♦ గట్టువడఁడు॥ 22

తే। గీ। సంగరహితుండు ముక్తవాం ♦ ఛాచయుండు,
జ్ఞాన సుస్థిత చేతస్కుఁ ♦ డైనవాఁడు,
యజ్ఞము నిమిత్తమౌ కర్మ ♦ మాచరింప,
నట్టి కర్మంబు, లయమగు స ♦ మగ్రముగను॥ 23

కం॥ బ్రహ్మమె పాత్రయు, ద్రవ్యము;
బ్రహ్మాగ్నిన్ హుతముసేత ♦ బ్రహ్మవలననే;
బ్రహ్మమె గంతవ్యం, బా
బ్రహ్మాత్మక కర్మనిష్ఠఁ ♦ బ్రబలు సమాధిన్॥ 24

కం॥ ధరణీస్థలి యోగులు కొం
దఱు సేవించెదరు దేవ ♦ తా యజ్ఞమునే;
మఱి కొందఱు యజ్ఞముచే
త, రహిన్, యజ్ఞమును వ్రేల్చె ♦ దరు బ్రహ్మాగ్నిన్॥25

తే॥ గీ॥ వేఱు కొందఱు శ్రోత్రాది ♦ వితతి నెల్ల
సంయమాగ్నిని హోమంబు ♦ సల్పుచుంద్రు;
అనఘ! కొందఱు స్వేంద్రి. ♦ యాగ్నులందు
వేల్చుచుందురు శబ్దాది ♦ విషయములను॥ 26

తే॥ గీ॥ ఇంకఁ గొందఱు జ్ఞానక ♦ ర్మేంద్రియముల-
సర్వచేష్టలుఁ, బ్రాణచే ♦ ష్టలును, పార్థ!
వ్రేల్చుచుందురు జ్ఞానదీ ♦ ప్తిని వెలుంగు
నాత్మ సంయమరూప యో ♦ గాగ్నియందు॥ 27

ఆ॥ వె॥ ఒకరు ద్రవ్యయజ్ఞ, ♦ మొకరు తపోయజ్ఞ,
మొకరు యోగయజ్ఞ, ♦ మొకరు జ్ఞాన
యజ్ఞ, మొకరు రక్ష్య ♦ యన యజ్ఞ, మొనరింత్రు
యతులు సంశిత వ్ర ♦ తాఢ్యు లగుచు॥ 28

క॥ ప్రాణాయామాసక్తులు
ప్రాణాపానముల గతుల ♦ నడ్డినవారై
ప్రాణమున, నపానంబుం,
బ్రాణ, మపానమున, వ్రేల్తు, ♦ రమల గుణాఢ్యా ! 29

తే॥ గీ॥ పరిమి తాహారు లై నకొం ♦ దఱు, కిరీటి !
ప్రాణముల హోమ మొనరింతు ♦ వాని యందె;
వీర లెల్లరు యజ్ఞసం ♦ వేత్త లగుట
యజ్ఞ నిర్ధూత కల్మషు ♦ లై రహింత్రు॥ 30

తే॥ గీ॥ యజ్ఞ శేషామృతము గ్రోలు ♦ నట్టి వార
లాది విరహిత బ్రహ్మంబు ♦ నందఁ గలరు;
యజ్ఞ హీనున కిహమె శూ ♦ న్యంబు గాఁగఁ,
బరము మాటేడఁ? గురువంశ ♦ వార్ధి చంద్ర ! 31

తే॥ గీ॥ ఇట్లు వివిధ యజ్ఞములు వి ♦ స్తృతము లయ్యె
బ్రహ్మ ముఖమునయందుండి, ♦ పాండుపుత్త్ర !
వాని నెల్లను గర్మోద్భ ♦ వంబు లంచుఁ
దెలిసికొని, బంధమందుండి ♦ తొలఁగఁ గలవు॥ 32

తే॥ గీ॥ నరవినుత ! ద్రవ్య సాధ్య య ♦ జ్ఞంబు కంటె,
జ్ఞాన యజ్ఞంబె విపులశ్రే ♦ ష్ఠమ్ము; సుమ్ము;
సర్వ కర్మచయంబును ♦ జ్ఞాన మందు
లయము చెందును బూర్తి యఖి ♦ లముగఁ, బార్థ ! 33

తే॥ గీ॥ తత్త్వ సందర్శులగు జ్ఞాన ♦ ధనులు నీకు
జ్ఞాన మెది యుపదేశంబు ♦ సల్పఁ గలరో,
దాని నార్జింపుము ప్రణిపా ♦ తంబు వలనఁ,
ప్రశ్న వలనను, మఱి, సేవ ♦ వలనఁ, బార్థ! 34

తే॥ గీ॥ ఎది యెఱింగిన మఱల నీ ♦ విట్టి మోహ
మొందఁగాఁబోవో, దేనిచే ♦ నుర్వి నెల్ల
ప్రాణులను జూడఁ గలవో నీ ♦ యాత్మయందుఁ,
బిదప నాయందు, జ్ఞాన మ ♦ య్యదియె, పార్థ! 35

తే॥ గీ॥ ధరణిఁ గల్గెడి పాపులం ♦ దఱిని మించి
పాప కృత్యంబు లొనరించు ♦ వాఁడ వయ్యు,
జ్ఞాన మను తెప్ప చేతనే, ♦ సర్వ పాప
సంచయమ్మును దాఁటంగఁ ♦ జాలు దీవు॥ 36

తే॥ గీ॥ ప్రజ్వలించెడి యగ్నిసో ♦ త్రం బదెట్లు
సమిధ లన్నింటి భస్మంబు ♦ సల్పఁ గలదో,
అట్లె, జ్ఞానానలంబు స ♦ మస్త కర్మ
ములను భస్మంబు చేయంగఁ ♦ గలుగుఁ, బార్థ! 37

తే॥ గీ॥ జ్ఞాన మనువానితోఁడ స ♦ మానసరణి
శుద్ధ మైనది యెదియు లే ♦ దిద్ధరిత్రి;
వినుము యోగంపు సంసిద్ధిఁ ♦ గను కొలదియు,
నరుఁడు తనుదానె యాత్మయం ♦ దెఱుఁగు, దాని॥ 38

తే॥ గీ॥ జ్ఞానము లభించుఁజుమి, తదా ♦ సక్తితోడఁ
దివురు శ్రద్ధాళువగు జితేం ♦ ద్రియున, కనఘ !
జ్ఞానము లభింప, నుత్కృష్ట ♦ శాంతి నైత
మచిర కాలంబులోనె, సం ♦ ప్రాప్తమగును॥ 39

తే॥ గీ॥ జ్ఞాన హీనుండు, శ్రద్ధయు ♦ లేని వాఁడు,
సంశయాత్ముఁడు, సర్వనా ♦ శంబుఁ జెందు;
లే దిహంబు, పరంబును ♦ లేదు, సుఖము
మొదలె లేదయ్య సంశయా ♦ త్మునకుఁ, బార్థ ! 40

తే॥ గీ॥ యోగ సన్న్యస్త కర్మ ప్ర ♦ యుక్తుఁ డగుచు,
జ్ఞాన సంఛిన్న సర్వ సం ♦ శయుఁడు నగుచు,
సంత తాత్మ రతుండగు ♦ జనున కిలను
గర్మములు సుంతయును బంధ ♦ కములు గావు॥ 41

తే॥ గీ॥ కనుక, నోపార్థ ! యజ్ఞాన ♦ జనిత మగుచు
నీదు హృదయస్థ మైన సం ♦ దేహ మెదియొ,
దాని, జ్ఞానాసి చేత ఛే ♦ దన మొనర్చి,
యోగ మొనరింపు, మిఁక లెమ్ము ♦ యుద్ధమునకు॥ 42

ఇది శ్రీ లక్ష్మీనరసమాంబా హనుమయార్య పుత్త్రి,
కవిజన విధేయ, మయిలవర వంశీయ, వేంకటరామ నామధేయ
ప్రణీతంబైన " భగవద్గీతానువాదము " నందలి
' జ్ఞానయోగ ' మను
నాల్గవ యధ్యాయము
సంపూర్ణము.



శ్రీ

# భగవద్గీతానువాదము

## ఐదవ యధ్యాయము.

## సన్న్యాస యోగము.

అర్జునుఁ డిట్లనియెను :

కం॥ ఒకపరిఁ, గర్మల విడుటయు,
ఒకపరి, యోగమును, జెప్పి ♦ చుంటి; వీ ద్వయమునం
దకలంక శ్రేయము నిదు
నొకదానినె తెల్పు, నిశ్చి ♦ తోక్తుల నాథా॥ 1

శ్రీ భగవానుఁ డిట్లు చెప్పెను :

తే॥ గీ॥ కర్మసన్న్యాస కర్మయో ♦ గంబు లనెడి
ఉభయ మార్గంబులును మోక్ష ♦ మొసఁగునవియె;
వానిలోఁ, గర్మసన్న్యాస ♦ పథముకంటెఁ
గర్మయోగంబె శ్రేష్ఠమై ♦ గ్రాలుచుండు॥ 2

తే॥ గీ॥ ఎవఁడు ద్వేషంబుఁ గాంక్షయు ♦ నెడయఁ గలఁడొ,
అతని నెఱుఁగుము "నిత్యస ♦ న్న్యాసి" యంచు;
ద్వంద్వ రహితుండు తా, సుల ♦ భముగ, సకల
కర్మబంధ వినిర్ముక్తిఁ ♦ గాంచఁ గలఁడు॥ 3

తే॥ గీ॥ "సాంఖ్య యోగముల్ ఫలభిన్న ♦ సరణు" లంచు
బాలురు వచింత్రు, పండితుల్ ♦ పల్కరట్లు;
అందు నొకటేని లెస్సగా ♦ ననుసరింపఁ
గలుగు రెండింటిదౌ నేక ♦ ఫలము దాన॥ 4

తే॥ గీ॥ సాంఖ్యమార్గులు పొందెడి ♦ స్థానమెదియొ,
అదియె యోగులుగూడఁ బొం ♦ దెదరు, పార్థ!
సాంఖ్య యోగ పథంబు లెం ♦ చంగ నొకటె;
దీనిఁ దెలిసినఁ, గలరూపు ♦ తెలిసి నట్లు॥ 5

తే॥ గీ॥ ప్రకృతిగత కర్మయోగ దూ ♦ రస్థ మగుటఁ
గర్మసన్న్యాస మొందుట ♦ కష్ట మరయ;
యోగమార్గ ప్రయుక్తుఁ డై ♦ యున్న మునియొ,
అచిర కాలంబులోనె బ్ర ♦ హ్మమును బొందు॥ 6

తే॥ గీ॥ అనవరత యోగ సంస్థితుం, ♦ డమల చిత్తుఁ,
డాత్మజిత దేహుఁడు, జితేంద్రి ♦ య ప్రయుక్తుఁ,
డఖిల భూతాత్మభూ తాత్ముఁ ♦ డైన మనుజుఁ
డాచరించెడి కర్మంబు ♦ లంట వతని॥ 7

కం॥ కనుచు, వినుచు, తాకుచు, మూ
ర్కొనుచుఁ, దినుచు, నడుచు, చూర్చు ♦ గొనుచును, నిద్రం
గనుచుఁ, బలుకు, చెడపుచుఁ, గై
కొనుచును, గన్నులను మూసి ♦ కొనుచుఁ దెఱచుచున్॥

ఆ॥ వె॥ "ఇంద్రియములు మెలఁగు ♦ నింద్రియార్థములందు"
అని సునిశ్చితంపు ♦ మనసు గలిగి,
"నేను చేయువాఁడఁ ♦ గా నొకింతే" నంచుఁ
దలఁచు, యోగియైన ♦ తత్త్వవేత్త॥ 8, 9

తే॥ గీ॥ ఎవఁడు సంగంబు త్యజియించి ♦ యెల్ల కర్మ
ములను బ్రహ్మార్పణముగ స ♦ ల్పునొ, యతండు
పాప మనుదానిచే నంటఁ ♦ బడఁడు సూవె,
ఉదక మందున్న తామరా ♦ కో యనంగ॥ 10

తే॥ గీ॥ యోగిజను, లాత్మసంశుద్ధి ♦ నొందు కొఱకు,
సంగము త్యజించి కర్మంబు ♦ సల్పు చుంద్రు,
బొందిచేతను, మనసుచే, ♦ బుద్ధిచేత,
లోలతాదూర సకలేంద్రి ♦ యాళిచేత॥ 11

తే॥ గీ॥ కర్మఫలము త్యజింపంగఁ ♦ గల్గి యోగి
నిత్యనిష్టా ప్రభూత శాం ♦ తిని గడించు;
యోగయుక్తి నెఱుంగలే ♦ కున్నవాఁడొ,
కామ జనిత ఫలాసక్తిఁ, ♦ గట్టువడును॥ 2

తే॥ గీ॥ వినుః నవద్వార పురమైన ♦ తనువు నందు
సర్వకర్మాళి మనసుచే ♦ సన్న్యసించి,
యెద్దియును జేయకుండఁ, జే ♦ యింపకుండఁ
గడుసుఖంబుగ స్వవశేంద్రి ♦ యుఁడు వసించు॥ 13

తే॥ గీ॥ పురమి, జనులకుఁ గర్తృత్వ ♦ బుద్ధిగాని,
కర్మములు గాని, తత్ఫల ♦ కలన గాని,
కలుగఁ జేయఁడు దేహము ♦ దలి ప్రభుండు;
ప్రకృతియే మూల మెల్లవ్యా ♦ పారములకు॥ 14

తే॥ గీ॥ నరుని పాపంబునకును, బు ♦ ణ్యంబునకును,
బాధ్యత గ్రహింపఁబోవఁడు ♦ ప్రభుఁ డతఁడు;
జ్ఞాన మజ్ఞాన మహిమచేఁ ♦ గప్పఁ బడియె,
దాన మోహిత, మీ ప్రాణి ♦ తతి, కిరీటి ! 15

తే॥ గీ॥ ఎవరి యజ్ఞానమది నశి ♦ యించు స్వీయ
మైన జ్ఞానంపు మహిమచే, ♦ నట్టివారి
జ్ఞాన తేజంబు సూర్యుని ♦ కాంతిఁబోలెఁ
దత్పరుండగు ప్రభుని వ్య ♦ క్తంబు సేయు॥ 16

తే॥ గీ॥ జ్ఞాన నిర్ధూత కల్మషు ♦ లైన పురుషు,
లాత్మనిష్ఠులు, తత్పరా ♦ యణులు, సంత
తాత్మ రతులు, తదాత్ములై ♦ నట్టివారు,
తిరిగి జన్మంబు నొందని ♦ స్థితి గడింత్రు॥ 17

తే॥ గీ॥ వినయ విద్యా విశిష్టుఁడౌ ♦ విప్రునందు,
ధేనువందును, గజమందు, ♦ శ్వానమందు,
శ్వానమును వండి భక్షించు ♦ వాని యందు,
జ్ఞానులగువారు సమబుద్ధి ♦ గలిగి యుంద్రు॥ 18

తే॥ గీ॥ ఎవరి మనమున సమభావ ♦ మిమిడియుండు,
వారలు జయింతురి జన్మసం ♦ సారమిందె;
బ్రహ్మము సమంబు, దోషదూ ♦ రంబు నగుట,
వారు సుస్థిరు లై యుందురి ♦ బ్రహ్మమునందు॥ 19

తే॥ గీ॥ మోహము త్యజించి నిశ్చయ ♦ బుద్ధి గలిగి,
బ్రహ్మమందున్న వాఁడయి ♦ బ్రహ్మవేత్త
ప్రియము ప్రాప్తింప సంతోష ♦ విస్మృతిఁ గాంచఁ,
డప్రియ ప్రాప్తిచే ఖేద ♦ మందఁ బోఁడు। 20

తే॥ గీ॥ బాహ్య విషయాళి నాసక్తి ♦ వదలి వైచి,
ఆత్మ సంబంధ సౌఖ్య సం ♦ ప్రాప్తిఁ గాంచి,
బ్రహ్మయోగ యుక్తాత్ముఁడై ♦ వఱలు నెవ్వఁ,
డతఁడు పడయంగ నేర్చు శా ♦ శ్వత సుఖమ్ము। 21

తే॥ గీ॥ విషయ సంస్పర్శచేఁ బ్రభ ♦ వించునట్టి
సౌఖ్యములు, ధాత్రి, నాద్యంత ♦ సహితములయి
దుఃఖ పరిణామమునకు హే ♦ తువులు గాన,
జ్ఞానులు రమింపఁ జూడ ర ♦ వ్వాని యందు॥ 22

కం॥ పుడమితల మందె, తనువుఁ
విడుచుటకుం బూర్వమున నె, ♦ నరుఁడు పంప
ర్వడఁ గామ క్రోధజ మగు
నొడుదొడుకోర్వఁగలవాఁడె ♦ యోగియు, సుఖియున్॥

కం॥ పాయక యంతస్సుఖ రతుఁ
డై, యంతర్జ్యోతియును, స ♦ దాంతః క్రీడుం,
డౌ యోగి, బ్రహ్మభూతుం
డై, యల నిర్వాణ పదవి ♦ నందఁగ నేర్చున్॥ 24

తే॥ గీ॥ క్షీణ కల్మషులగుచు, వి ♦ చ్ఛిన్నసంశ-
యాత్ములగుచును, వినియమి ♦ తాత్ము లగుచుఁ,
ప్రాణికోటి హితాసక్తు ♦ లైన ఋషులు
బ్రహ్మ నిర్వాణ పదమును ♦ బడయ నేర్తురు॥ 25

కం॥ గత కామ క్రోధాత్ములు,
యతచిత్తులుఁ, బ్రస్ఫుటీకృ ♦ తాత్ములు నగు సం
తత సామ్యబుద్ధియోగా
న్వితులకుఁ గరగతము బ్రహ్మ ♦ నిర్వాణ, మెటన్॥ 26

తే॥ గీ॥ బాహ్య విషయంబులను వెలు ♦ పలికిఁ ద్రోసి,
కనుబొమల మధ్య దృష్టిని ♦ గట్టి వైచి,
ప్రాణము, నపానమును, ఘ్రాణ ♦ రంధ్ర యుగళి
సమముగఁ జరింపఁ జేసెడి ♦ జాడ నెఱిఁగి॥

తే॥ గీ॥ ఆత్మవశ మనోబుద్ధీంద్రి ♦ యములతోడ,
విగత కామ భయ క్రోధ ♦ వితతి గలిగి,
మోక్షమునె గోరుచుండెడి ♦ ముని వరేణ్యుఁ
డెల్ల యెడలను ముక్తుఁడై ♦ యెసఁగు చుండు॥ 27,28

తే॥ గీ॥ పుడమిఁగల యజ్ఞ తపముల ♦ భో క్త నగుచు,
సర్వ లోకాళికిని మహే ♦ శ్వరుఁడ నగుచు,
ఎల్ల భూతంబులకును స్నే ♦ హితుఁడ నైన
నను నెఱింగిన వాఁడయి, ♦ కనుఁ బ్రశాంతి॥ 29

ఇది శ్రీ లక్ష్మీనరసమాంబా హనుమయార్య పుత్త్రి,
కవిజన విధేయ, మయిలవర వంశీయ, వేంకటరామ నామధేయ
ప్రణీతంబైన "భగవద్గీతానువాదము" నందలి
'సన్న్యాస యోగ' మను
ఐదవ యధ్యాయము
సంపూర్ణము.



శ్రీ

# భగవద్గీతానువాదము

## ఆఱవ యధ్యాయము.

### ఆత్మసంయమయోగము, లేక, ధ్యానయోగము.

శ్రీ భగవానుఁ డిట్లు చెప్పెను :

తే॥ గీ॥ ఎవఁడు నిజకర్మ ఫల మాశ్ర ♦ యింపకుండఁ,
జేయఁ దగినట్టి కర్మంబు ♦ చేయుచుండు,
అతఁడె సన్న్యాసి యనఁజెల్లు; ♦ నతఁడె యోగి;
అట్లుగాదు నిరగ్నియు, ♦ నక్రియుఁడును॥ 1

తే॥ గీ॥ ఏది సన్న్యాస మని వచి ♦ యించుచుంద్రో,
అదియె యోగంబునాఁ దెలి ♦ యంగవలయుఁ;
గామసంకల్ప సన్న్యాసి ♦ గాని వాఁడు
యోగియని పల్కఁగా నోపి ♦ యుండఁ డెవఁడు॥ 2

తే॥ గీ॥ యోగమం దెక్కఁగోరిక ♦ యున్న మునికిఁ
గర్మమె (శమంబు సమకూర్పఁ) ♦ గారణంబు,
అతఁడె యోగమం బారూఢుఁ ♦ డైన పిదప
* శమమె (కర్మంబునకుఁ) గార ♦ ణముగ దేలు॥ 3

* ఈపద్యము తిలక్ మహాశయుని వ్యాఖ్యానము ననుసరించుచున్నది.

తే॥ గీ॥ కర్మములయందు, విషయసం ♦ ఘాతమందుఁ,
దగులుబాటు త్యజించి, యె ♦ త్తఱిని మనుజుఁ
డఖిల సంకల్ప సన్న్యాసి ♦ యై గ్రహించు,
నట్టితఱిని యోగారూఢుఁ ♦ డని వచింత్రు॥ 4

కం॥ ఆత్మ నధోగతిఁబడనీ,
కాత్మోన్నతిఁ గూర్పవలయు ♦ నాత్మబలముచేఁ;
ఆత్మయె చుట్టం బాత్మకు,
ఆత్మయె యాత్మకు విరోధి ♦ యై ప్రబలుధరన్॥ 5

కం॥ ఆత్మ బలాతిశయంబున
ఆత్మను నిర్జించునాత్మ ♦ కాత్మయె చుట్టం;
బాత్మను జయింపఁ గల్గమి,
ఆత్మయె రిపుభంగి వైర ♦ మందు మెలంగున్॥ 6

తే॥ గీ॥ కలిత శీతోష్ణ సుఖదుఃఖ ♦ గతులయందు,
అట్లె, మానావమాన సం ♦ ప్రాప్తి యందు,
ఎవ్వఁడు ప్రశాంతి నాత్మజ ♦ యింపఁగలఁడో,
ఆతనికిఁ బరమాత్మ స ♦ మాహితుండు॥ 7

తే॥ గీ॥ జ్ఞాన విజ్ఞాన తృప్తాత్ముఁ ♦ డైనవాని,
అశ్మ, లోష్ట, సువర్ణంబు ♦ లందు సముని,
నియమి తేంద్రియుఁ, గూటస్థుఁ ♦ డయి చెలంగు-
యోగిజనుఁ, బ్రస్తుతింతురు ♦ యుక్తుఁడంచు॥ 8

కం॥ విను: సుహృదులు, మిత్రులు, రిపు
లును, మధ్యస్థులుఁ, దటస్థు ♦ లును, బాంధులు, స
జ్జనులును, ద్వేష్యస్థులు, దు
ర్జనులును, సము లెవని కిలఁ బ్ర ♦ శస్తుండతఁడే। 9

తే॥ గీ॥ యోగి, గోప్య స్థలంబున, ♦ నొంటరిగను,
నియత దేహ మనోయుక్తుఁ ♦ డయి, నిరాశఁ
దవిలి, యపరిగ్రహుండునై, ♦ యవిరతగతి,
నిల్పవలె నాత్మ, యోగంపు ♦ నిష్ఠయందు॥ 10

తే॥ గీ॥ తనదు పీఠంబు శుచియైన ♦ స్థలము నందు,
*అట్టి పల్లంబు, మెఱక, కా ♦ నట్లమర్చి,
స్థిరత చేకూర్చి, దానిపై ♦ వరుసగాను
దర్భలును, నజినమును, వ ♦ స్త్రమును బఱచి, 11

ఆ॥ వె॥ ఆ స్థిరాసనంబు ♦ నం దుపవిష్టుఁడై
చిత్త మేకముఖము ♦ చేసి, నియత
మాన సేంద్రియముల ♦ తో నభ్యసింపంగ
వలయు యోగ, మాత్మ ♦ కలుష మెడయ। 12

తే॥ గీ॥ తలయు, మెడయును, దనువుం, గ ♦ దల్పకుండ,
దృష్టి తన ముక్కుకొనను ల ♦ యింపఁజేసి,
దిక్కులను జూడకుండ సు ♦ స్థిరతమించి,
సమతఁ గూర్చుండవలెఁ దదా ♦ సనము మీఁద॥ 13

* ఈ పాదము, 'అట్టిపల్లం, అట్టి మెరక, కాకుండాచేసుకొని' అను వాక్యభావము బురస్కరించికొని వ్రాయఁబడినది.

తే॥ గీ॥ గతవిభీతుండు, శాంతిసం ♦ యుతుండు నగుచు
బ్రహ్మచర్యంపు నిష్ఠ, ధై ♦ ర్యము వహించి,
మనసు నరికట్టి, ననుఁగోరు ♦ మది దలిర్ప,
యోగి, మత్పరుఁడయి, కూరు ♦ చుండవలయు। 14

తే॥ గీ॥ అనఘ! యిట్టుల నెల్లెడ ♦ యత మనస్కుఁ
డగుచు నాత్మను యోగంబు ♦ నందు నిల్పి,
మద్వశంబును, మోక్షసా ♦ మ్రాజ్య రూప
కంబు, నగుశాంతిఁ బడయంగఁ ♦ గలఁడు యోగి॥ 15

తే॥ గీ॥ కుదుర దీయోగ మమిత భు ♦ క్తునకుఁ, బార్థ!
అది నిరాహారునకును ల ♦ భ్యంబు గాదు;
ఓవర దట్లది యధిక ని ♦ ద్రోన్ముఖునకు;
అమిత జాగరితకును సా ♦ ధ్యంబు గాదు। 16

కం॥ యుక్తాహార విహారుఁడు,
యుక్తగతిం గర్మతతుల ♦ నొనరుచు వాఁడున్,
యుక్తావబోధ నిద్రా
యుక్తుఁడు, దుఃఖంబుఁ బాపు ♦ యోగము నొందున్॥ 17

తే॥ గీ॥ తన యధీనత నున్న చి ♦ త్తం బదెప్పు
డాత్మ యొకదాననే లగ్న ♦ మై రహించు,
అష్టఖిలకామ జాలమం ♦ దాస తొలఁగి,
యోగయుక్తుండునాఁ, జెప్ప ♦ నొప్పు నరుఁడు॥ 18

ఆ॥ వె॥ వాయు చలన రహిత ♦ మైయుండు స్థలమునఁ
గదలకుండు దీప ♦ కళికఁ బోలి,
ఆత్మ నిరతి యోగ ♦ మభ్యసించెడి యోగి-
జనుని నియత మాన ♦ సము దనర్చు॥ 19

తే॥ గీ॥ యోగ సేవా నిరుద్ధమై ♦ యొనరి యుండు
చిత్త మేస్థితిలో శాంతిఁ ♦ జెందఁ గలదో;
మనసుచే యోగి యాత్మావ ♦ ర్శనముఁ బొంది,
ఆత్మ యందెప్పు డానంద ♦ మందఁ గలఁడో; 20

తే॥ గీ॥ ఎట్టి స్థితి, నతీంద్రియము, బు ♦ ద్ధ్యేక వేద్య,
మైన యత్యంత సౌఖ్యంబు ♦ నానఁ గలఁడో;
యే యవస్థను జెంది యుం ♦ తేనిఁ బిదపఁ
దాఁ, జలింపకయుండు త ♦ త్త్వంబునుండి; 21

తే॥ గీ॥ ఎద్ది లభియించి యున్నచో ♦ నితర లాభ
మధికతరముగఁ జూపట్టు ♦ దతని కింక;
ఎందు నిలిచిన వాఁడయి ♦ యెంత లావు
దుఃఖముననేని సంచలి ♦ తుండు గాఁడో; 22

తే॥ గీ॥ దుఃఖముల రాకపోకలు ♦ తొలఁగఁ జేయు
నదియె యోగం బటంద్రు సం ♦ జ్ఞార్థముగను;
బట్టుదలతోడ నిశ్చయ ♦ భావ యుక్తి,
దాని నభ్యాస మొనరింపఁ ♦ దగును, పార్థ! 23

తే॥ గీ॥ అరయ సంకల్ప జనితంబు ♦ లైన సర్వ
కామములను నిశ్శేషంబు ♦ గాఁ ద్యజించి,
మనసుచేతనె యింద్రియ ♦ మండలమును
నిఖిల విషయంబు లందుండి ♦ నిగ్రహించి, 24

ఆ॥ వె॥ ధృతి నియుక్తబుద్ధి ♦ యుతుఁడౌచు మానస
మాత్మ యందు నిలుచు ♦ నట్లొనర్చి,
మెల్లమెల్ల నుపర ♦ మింపంగ వలయును,
వేఱు చింతలెల్ల ♦ విడువ వలయు॥ 25

కం॥ నరముఖ్య! చంచలం, బ
స్థిర, మగుమన సెట్టులెట్లు ♦ తిరుగునో, యాయా
తెఱువులఁ బోనీయక, వశ
పఱుప వలయు దాని నాత్మ ♦ వర్తి యగునటుల్॥ 26

తే॥ గీ॥ గత రజోగుణుఁడు, ప్రశాంత ♦ మతి యుతుండు,
దోష రహితుండు, బ్రహ్మభూ ♦ తుండు నయిన
యిట్టి యోగిని, దానె చే ♦ పట్టుఁ గాదె
ఉత్తమంబగు సౌఖ్య సం ♦ పత్తి, పార్థ! 27

తే॥ గీ॥ ఇట్లు యోగంబునం దాత్మ ♦ నెల్లయెడల
నిలుపఁ గలయోగి నిర్ధూత ♦ కలుషుఁ డగుట,
సులభముగ, బ్రహ్మసంస్పర్శ ♦ గలిగినదగు
సౌఖ్య మత్యంత మొందంగఁ ♦ జాలు నతఁడు॥ 28

ఆ॥ వె॥ ఆత్మ యెల్ల ప్రాణు ♦ లందుండు దానిగ,
ఉర్విఁ బ్రాణు లాత్మ ♦ నుండు సవిగ,
అనుభవమునఁ జూచు, ♦ నల యోగయుక్తాత్ముఁ
డెల్ల యెడల సామ్య ♦ దృష్టి గలిగి। 29

తే॥ గీ॥ నను సమస్తంబు నందును ♦ గను నెవండు,
కలసమస్తంబు నాయందుఁ ♦ గాంచు నెవఁడు,
వాని కేలేని వాఁడను ♦ గాను, పార్థ !
వాఁడు నాకును లేనట్టి ♦ వాఁడు గాఁడు। 30

తే॥ గీ॥ ఉర్విఁగల భూతకోటియం ♦ దుష్ట నన్నుఁ
దా, భజన సేయు నెవ్వఁడ ♦ ద్వైత మరసి,
అల్ల యోగి వర్తించియు ♦ సకల గతుల,
వాఁడు నాయందు వర్తించు ♦ వాఁడె యగును॥ 31

తే॥ గీ॥ ఆత్మసామ్యత నెవ్వఁడు, ♦ ప్రాణితతికిఁ
గలుగు సుఖమునుగాని, దుః ♦ ఖమునుగాని,
తనదిగా నెంచునో సమ ♦ త్వంపుగరిమ,
అట్టియోగి మహోత్తముఁ ♦ డని తలంత్రు। 32

అర్జునుఁ డిట్లు పల్కెను:

తే॥ గీ॥ యోగ మెయ్యది సమదృష్టి ♦ యుత మటంచుఁ
బలికినాఁడవో, యది యెట్లు ♦ నిలుకడమొందు,
హృదయమునయందు నిలుచునో ♦ యెఱుఁగఁజాలఁ,
జిత్తమది చంచలంబౌట ♦ చేతఁ, గృష్ణ ! 33

తే॥ గీ॥ మనసు చంచలమైనది, ♦ మఱి, ప్రమాథి,
బల యుతంబు, దృఢం; బందు ♦ వలన దాని
నిగ్రహము దుర్లభం బంచు ♦ నేఁ దలంతు,
వాయువును మూటగట్టుట ♦ వలె, ముకుంద ! 34

శ్రీ భగవానుఁ డిట్లు చెప్పెను :

తే॥ గీ॥ అరయఁగ మనస్సు దుర్నిగ్ర ♦ హం బనుటయుఁ,
జంచలం బంటయును, నసం ♦ శయము, పార్థ !
కాని, యభ్యాస వైరాగ్య, ♦ కలన దాని
నిగ్రహింపంగ నగును, గుం ♦ తీ కుమార ! 35

తే॥ గీ॥ మానసము నిగ్రహింపంగ ♦ లేని మాన
వునకు యోగంబు దుర్లభం ♦ బనుట నిజము;
పూనిక గల్గి, వశాత్ముఁడౌ ♦ పూరుషునకో,
అది సుసాధ్యంబె యగు, నుపా ♦ యమ్ము చేత॥ 36

అర్జునుఁ డిట్లు ప్రశ్నించెను :

తే॥ గీ॥ శ్రద్ధ గల్గియు, యత్నంపు ♦ శక్తి లేమిఁ,
జిత్తమది యోగ మందుండి ♦ చెదరె నేని,
యోగ సంభూత సంసిద్ధి ♦ నొంద లేక,
ఆతఁ డేగతి నొందునో, ♦ యనఘ ! చెపుమ॥ 37

తే॥ గీ॥ బ్రహ్మ సందర్శ నాత్మక ♦ పథము నందు,
జ్ఞాన విరహితుఁడై స్థిరా ♦ శ్రయము లేక,
ప్రకట సాంఖ్యయో గోభయ ♦ భ్రష్టుఁ డగుచు,
మొదలె చెడునేమొ, ఛిన్న జీ ♦ మూత మట్లు॥ 38

తే॥ గీ॥ నాదు సందేహమిద్ది పూ ♦ ర్ణముగఁ దీర్ప
నీవె తగినట్టి వాఁడవు, ♦ నిర్మలాత్మ !
యీ శంకం దవ్వుదక్క- నిం ♦ కితరు లెట్టి
సంశయంబును ఛేదింపఁ ♦ జాల రెవరు। 39

శ్రీ భగవానుఁ డిట్లు చెప్పెను :

తే॥ గీ॥ వానికి, నిహమునఁగాని, ప ♦ రమునఁగాని,
నాశ మనునది కలుగ దె ♦ న్నంటి కేని;
మంచి కార్యమ్ము లొనరించు ♦ మనుజుఁ డెవఁడు-
గాని, దుర్గతి నొందంపు ♦ గాదె, తండ్రి ! 40

తే॥ గీ॥ పుణ్య కర్మల లోకముల్ ♦ పొంది, యచటఁ
జాల వత్సరములు నివా ♦ సంబు చేసి,
ధనికులును, బరిశుద్ధులౌ ♦ జనుల యింట
యోగ సంసిద్ధి చెడినవాఁ ♦ డుద్భవించు। 41

తే॥ గీ॥ అట్లు గాకున్న, ధీమంతు ♦ లై రహించు
యోగి జనముల కులమందె ♦ యుద్భవించు;
ఇట్టి పుట్టువు లోకమం ♦ దెద్ది గలదో,
అది లభించుట మిక్కిలి ♦ యరుదు గాదె। 42

తే॥ గీ॥ ఆ కులంబునఁ, బూర్వదే ♦ హప్రభూత
బుద్ధి సంస్కార, మీదేహ ♦ మున గడించి,
దాని సాయంబు వలన, నా ♦ తండు మఱల
యోగ సంసిద్ధిఁ బడయంగ ♦ నుద్యమించు। 43

తే॥ గీ॥ పూర్వకృతమౌ తదభ్యాస ♦ మునను యతఁడు
యోగమునకై, లాగుపడుఁడయ్యు, ♦ లాగఁబడును;
అనఘ! యోగ జిజ్ఞాసునే ♦ యయ్యు, శబ్ద
వాచ్యమౌ బ్రహ్మమును దాఁటి ♦ పంగ నేర్చు॥ 44

తే॥ గీ॥ ఇట్లు లీయోగి పూనిప్రయత్నిఁ ♦ గృషి నొనర్చి
అమలినీకృత కిల్బిషుఁ ♦ డై, యనేక
జన్మ సంస్కార పరిణామ ♦ జనిత యోగ
సిద్ధిగని, దాన నుత్తమ ♦ స్థితి గడించు। 45

తే॥ గీ॥ తాపసులకంటె యోగియు ♦ త్తముఁడు సూవె;
అరయ, జ్ఞానులకంటెను ♦ నధికుఁ డతఁడు;
కర్మ తత్పరులగు వారి ♦ కంటె మిన్న;
కనుక, నో పార్థ! యోగివి ♦ కమ్ము నీవు॥ 46

తే॥ గీ॥ అంతరాత్మను సతము నా ♦ యందె నిలిపి,
యెవఁడు శ్రద్ధాళువై భజి ♦ యించు నన్ను.
వాఁడె సుమి, పార్థ! నా యభి ♦ ప్రాయ మందు,
యోగు లందఱిలోఁ గూడ ♦ యుక్తతముఁడు॥ 47

ఇది శ్రీ లక్ష్మీనరసమాంబా భానుమయార్య పుత్త్రి,
కవిజన విధేయ, మయిలవర వంశీయ, వేంకటరామ నామధేయ
ప్రణీతంబైన "భగవద్గీతానువాదము" నందలి
'ఆత్మ సంయమ యోగము, లేక, ధ్యాన యోగ' మను
ఆఱవ యధ్యాయము
సంపూర్ణము.



శ్రీ

# భగవద్గీతానువాదము

## ఏడవ యధ్యాయము.

### జ్ఞానవిజ్ఞానయోగము.

శ్రీభగవానుఁ డిట్లు చెప్పెను:

ఆ॥ వె॥ నన్న యాశ్రయించి ♦ నాయందె యాసక్తి
గలిగి యోగయుక్తి ♦ మెలఁగుచుండి,
నను, నసంశయంబు ♦ గను, సమగ్రముగాఁగ,
ఎఱుఁగు టెట్లొ వినవె ♦ యింక పైని॥ 1

తే॥ గీ॥ ఏది తెలిసినచో, మఱి ♦ యెఱుఁగఁ దగిన
దుర్వి వేఱొండు శేషించి ♦ యుండఁబోదొ,
అట్టి విజ్ఞాన సంయుక్త ♦ మైన జ్ఞాన
మిపు డశేషంబుగా వచి ♦ యింతు నీకు॥ 2

తే॥ గీ॥ పృథివిఁగల మానవులయందు ♦ వేయి కొకఁడు
సిద్ధికొఱకయి యత్నంబు ♦ సేయు చుండు;
యత్న మొనరించు వారిలో ♦ నైన, నన్నుఁ
గల తెఱఁగునఁ గనువాఁడొ ♦ కానొకండె॥ 3

కం॥ అనఘా! భూమియు, నుదకం,
బనలము, వాయువును, నగ్ని, ♦ యాకాశంబున్,
మనసును, బుద్ధి, యహంకృతి,
యన నాదగు ప్రకృతి భిన్న ♦ యష్ట విధములన్॥ 4

ఆ॥ వె॥ ఇపుడుచెప్పఁబడిన ♦ దపరా ప్రకృతి; దాని
కితరమౌ పరాప్ర ♦ కృతి యొకండు
కలదు నాకు; నదె జ ♦ గత్తును ధరియించు,
జీవభూతమై, య ♦ శోవిశాల! 5

ఆ॥ వె॥ ఎల్లభూతములకు ♦ నీరెండు ప్రకృతులే
ఆది కారణంబు ♦ లని యెఱుంగు;
నేనె ప్రభవహేతు ♦ వేనె ప్రళయహేతు
వఖిల జగమునకుఁ, బృ ♦ థాత్మజాత! 6

తే॥ గీ॥ అరయ, నాకంటెఁబరతరం ♦ బైన కార
ణంబు మఱియొండు లేదొకిం ♦ తయును, పార్థ!
ఉండునదియెల్ల నాయందుఁ ♦ బ్రోతమయ్యె,
దారమునయందు రత్నవి ♦ తాన మట్లు॥ 7

తే॥ గీ॥ నీటియందలి సారంబు ♦ నేనె, పార్థ!
రవి శశాంకుల యందలి ♦ ప్రభయు నేనె;
కలశ్రుతులయందుఁ గల్గునోం ♦ కారమేనె,
నరుల పౌరుషమును, నింగి ♦ నాదమేనె। 8

తే॥ గీ॥ ధరణి యందలి మంచిగం ♦ ధంబు నేనె;
జ్వాలను నందలి ప్రకట తే ♦ జస్సు నేనె;
జీవరాసుల యందలి ♦ జీవ మేనె;
తాపసులయందుఁ గననగు ♦ తపము నేనె॥ 9

తే॥ గీ॥ అఖిల భూతంబులకును, న ♦ నాది సిద్ధ
మైన బీజంబు నేనె యం ♦ చెరయు, మనఘ!
బుద్ధిమంతుల యందలి ♦ బుద్ధి నేనె;
తేజము గలారలందలి ♦ తేజ మేనె॥ 10

కం॥ బలవంతు లైనవారల
బలమేనే, కామరాగ ♦ వర్జిత మగునేఁ;
ఇలఁ బ్రాణిజాత మందుం
గలిగెడి ధర్మావిరుద్ధ ♦ కామము నేనే॥ 11

తే॥ గీ॥ సాత్త్వికము, రాజసము, తామ ♦ సం బనంగ,
భావము లవేవి పుట్టుఁ, ద ♦ ద్భావతతులు
కలుగునావల్లనే యని ♦ తెలియు, మనఘ!
వశములవి నాకు; నేవాని ♦ వశము గాను॥ 12

తే॥ గీ॥ ఒగి గుణత్రియ వికృతులై ♦ యొదవు నట్టి
యీత్రిభావంబులన్ సర్వ ♦ మీ జగత్తు
మోహితంబౌటఁ, దద్భావ ♦ ములకుఁ బరుఁడ
నవ్యయుఁడ నైన ననుఁ దెలి ♦ యంగ లేదు॥ 13

తే॥ గీ॥ దైవ సంబంధమును, గుణ ♦ త్రయ మయంబు
నైన యీనాదు మాయ దు ♦ రత్యయంబు;
నన్నె యేమానవులు శర ♦ ణంబు గొంద్రొ,
వార లీమాయ దాఁటంగ ♦ గలరు సుమ్ము! 14

తే॥ గీ॥ మూఢ మతులును, దుష్ట క ♦ ర్ములును, నీచ
జనులు, మాయాపహృత నిజ ♦ జ్ఞాను లగుచు,
ఆసురంబౌ స్వభావంబు ♦ నాశ్రయించి,
శరణు పొందరు నన్ను, రా ♦ జకులదీప! 15

తే॥ గీ॥ ఆర్త జనములు, జిజ్ఞాసు ♦ లైన వారు,
ద్రవ్యకాములు, మఱి, జ్ఞాన ♦ ధను, లటన్న
నలు తెఱంగుల్ల సుకృత వం ♦ తులు జగాన
నను భజించుచు నుంద్రు, మా ♦ నవ వరేణ్య! 16

తే॥ గీ॥ వారిలో, నిత్య యోగాను ♦ వర్తి యగుచు,
మత్పరానన్య భక్తిసం ♦ పన్నుఁ డైన
జ్ఞానియే శ్రేష్ఠుఁ; డాతని ♦ కేను మిగులఁ
బ్రియుఁడ నైయుందు; నతఁడును ♦ బ్రియుఁడు నాకు॥ 17

తే॥ గీ॥ వీర లెల్లరు నెన్నగా ♦ వారె; కాని,
జ్ఞానియో, "నేనె" యంచు న ♦ స్మన్మతంబు,
వాఁడు, యుక్తాత్ముఁ డై, నన్నె ♦ పరమ గతిగ
నిశ్చయించిన వాఁడయి ♦ నెగడు కతన॥ 18

తే॥ గీ॥ ఎవ్వఁ డిల బహు జన్మంబు ♦ లెత్తి తుదకు
జ్ఞాన సంపన్నుఁ డై, సను ♦ స్తంబు వాసు
దేవుఁడే యని సన్నుఁ జిం ♦ తించుచుండు,
ఆ మహాత్ముండు దుర్లభుం ♦ డన్య, మునులు॥ 19

కం। స్వీయ స్వభావ నియమితు
లాయా కోరికల చేత ♦ నపహృత మతులై,
ఆయా విధులం గొల్చెద
రాయా పరదేవతలఁ ద ♦ దాశ్రయు లగుచున్॥ 20

ఆ। వె। ఎవ్వఁ డెవనిని భక్తి ♦ నేయే స్వరూపమున్
శ్రద్ధతోడ నర్చ ♦ సల్పఁ గోరు,
వానివాని యందు ♦ వఱలు తచ్ఛ్రద్ధయే
స్థిరత వడయునట్లు ♦ సేయు చుందు॥ 21

తే। గీ। అట్టి శ్రద్ధ గలట్టి వాఁ ♦ డై యతండు
ప్రీతిమెయి నిష్టమూర్తి న ♦ ర్చించుచుండుఁ;
దన్ముఖంబున, మన్నిర్మి ♦ తములె యైన
తన యభీష్టంపు ఫలము లొం ♦ దంగనేర్చు॥ 22

తే। గీ। కాని, యా యల్పభావనా ♦ ధీనమతులు
పడయఁ గల్గెడి ఫల మంత ♦ వంత మరయ;
దేవ యజనులు గనునది ♦ దేవతలనె,
నాదు భక్తులు గనునది ♦ న న్ననంతు॥ 23

తే॥ గీ॥ అవ్యయంబు, సనుత్తమం ♦ బైన నాదు
పరమ భావం బెఱుంగని ♦ పామరాళి
వాస్తవావ్యక్తు నన్నొక ♦ వ్యక్తియంచుఁ
దలఁచుచుందురు బుద్ధిమాం ♦ ద్యాబునకతన॥ 24

తే॥ గీ॥ యోగమాయావృతుండనై ♦ యుండు నేను
సర్వ సామాన్యులకుఁ బ్రకా ♦ శకుఁడఁ గాను;
ఎఱుక లేమిఁ బ్రమత్తమౌ ♦ నీ ప్రపంచ
మరయఁగా లేదు నన్నజు ♦ నవ్యయునిగ॥ 25

కం॥ చన్నట్టి ప్రాణితతి, నిపు
డున్నట్టియు, నిఁక జనింప ♦ నున్నట్టియు, వా
రి, న్నెఱుఁగుదుఁ జుమీ; న
న్నన్ననొ యొకఁడైన నెఱుఁగఁ ♦ డయ్య, కిరీటీ! 26

తే॥ గీ॥ సర్వభూతంబు, లవియవి ♦ జన్మ మొందు
సమయ మందె, రాగద్వేష ♦ జనితములగు
సౌఖ్య దుఃఖాదు లనియెడి ♦ జంట లందుఁ,
జిక్కి, యత్యంత మోహంబు ♦ చెంది యుండు॥ 27

తే॥ గీ॥ మనుజు లెవ్వారు పుణ్యక ♦ ర్మములు చేసి,
స్వీయ పాపంబు నెల్లఁ బా ♦ పికొనఁ గలరొ,
వార లీద్వంద్వ మోహంబు ♦ వదలఁ గలిగి
నను భజింతురు గాఢ ని ♦ ష్ఠను, గుణాఢ్య! ౨౮

తే॥ గీ॥ జరయు, మరణంబు దాఁటుట ♦ కొఱకు నెవరు
యత్న మొనరింతురో నన్ను ♦ నాశ్రయించి,
వారెఱుంగుదు రద్భుత ♦ బ్రహ్మ మదియు,
నెల్ల యధ్యాత్మమును, గర్మ ♦ మెల్ల నెల్ల॥ 29

తే॥ గీ॥ సాధిభూతుండనైన నన్ను, ♦ సాధిదైవు,
సాధియజ్ఞునిఁ, దెలియఁగ ♦ లట్టివారు
తమదు ప్రాణప్రయాణకా ♦ లమునఁ గూడ
యుక్త చేతస్కులై తెలి ♦ యుదురు నన్ను॥ 30

ఇది శ్రీ లక్ష్మీనరసమాంబా హనుమయార్య పుత్రి,
కవిజన విధేయ, మయిలవర వంశీయ, వేంకటరామ నామధేయ
ప్రణీతంబైన " భగవద్గీతానువాదము " నందలి
'జ్ఞానవిజ్ఞాన యోగ' మను
ఏడవ యధ్యాయము
సంపూర్ణము.



శ్రీ

# భగవద్గీతానువాదము

## ఎనిమిదవ యధ్యాయము.

### అక్షర పరబ్రహ్మయోగము.

అర్జునుఁ డిట్లు ప్రశ్నించెను :

తే॥ గీ॥ ఆ పరబ్రహ్మ మెద్ది? అ ♦ ధ్యాత్మ మెద్ది?
కర్మమన దేనిఁ దెలియనౌ, ♦ కంజ నేత్ర!
దేని నధిభూత మంద్రు తత్ ♦ జ్ఞాన నిధులు?
దేని నధిదైవతం బంద్రు? ♦ తెలియఁ జెపుము॥ 1

తే॥ గీ॥ అనఘ! యీదేహమం దధి ♦ యజ్ఞుఁ డెవఁడు?
వాని నెట్టులఁ దెలియంగ ♦ వలయునిందుఁ?
దమదు ప్రాణప్రయాణ కా ♦ లమునయందు
నియత మానసు లెట్లు నిన్ ♦ దెలియఁ గలరు? 2

శ్రీ భగవానుఁ డిట్లు చెప్పెను :

తే॥ గీ॥ బ్రహ్మ ముత్కృష్టమౌ నక్ష ♦ రంబు సూవె;
అఖిల వస్తు స్వభావ మ ♦ ధ్యాత్మ మరయఁ;
బ్రాణి సంభవకర విస ♦ ర్గంబె, పార్థ!
కర్మ మనెడి సంకేతంబు ♦ గలిగియుండు॥ 3

తే॥ గీ॥ అనఘ! క్షరభావ మధిభూత ♦ మంద్రు బుధులు;
పురుషుఁ డధిదైవతం బనఁ ♦ బరగుచుండు;
ఈ శరీరంబునన్, దేహ ♦ భృద్వరేణ్య!
యెసఁగు నధియజ్ఞ వాచ్యుఁడ ♦ నేనె సుమ్మి॥ 4

తే॥ గీ॥ మృత్యు వాసన్న మగుతఱి ♦ నెవఁడు నన్ను
స్మరణ మొనరించుచుం, గళే ♦ బరము విడిచి
తరలుచున్నాఁడొ, వాఁడునా ♦ పరమ భావ
మొంద నేర్చును; సంశయం ♦ బింత లేదు॥ 5

కం॥ నరుఁ డేదే భావము తుది
స్మరియించుచు బొందివిడిచి ♦ చనునో, తాఁ గ్ర
మ్మఱ నాయా భావమునే
దొఱయును, దద్భావ భావి ♦ తుండౌట సదా॥ 6

తే॥ గీ॥ అందుచే, సర్వకాలంబు ♦ లందు నన్ను
సంస్మరింపుము; సమరముం ♦ సల్పు మట్లు;
మనసు, బుద్ధియు, నాకె య ♦ ర్పణము సేయు,
నన్ను, నిస్సంశయముగఁ, బొం ♦ దఁగల వీవు॥ 7

తే॥ గీ॥ మనుజుఁ, డభ్యాస యోగ స ♦ మన్వితమును,
అన్య మైనట్టి వానియం ♦ దంట నిదియు,
నైన చిత్తంబు గల్గి, దీ ♦ వ్యత్ప్రకాశుఁ,
బరమపురుషు, స్మరించుచుఁ ♦ బడయు నతని॥ 8

తే॥ గీ॥ ప్రాణముల్ తర్లు సమయమం ♦ దచల మతిని,
యోగబల, భక్తిమహిమ, సం ♦ యుక్తితోడఁ,
గనుబొమల మధ్య ప్రాణంబు ♦ కట్టి లెస్స,
యెవఁడు స్మరియించు: శాసకుం, ♦ గవిఁ, బురాణు,

తే॥ గీ॥ అణువు కంటెను సూక్ష్ముఁడై ♦ నట్టివాని,
సర్వ కర్తను, ధాతనా ♦ శక్య మూర్తి,
సూర్యనిభ కాంతియుతుఁ, దమ ♦ స్సునకుఁ బరుని,—
వాఁడు పడయును, దద్దివ్యుఁ ♦ బరమ పురుషు॥ 9,10

ఉ॥ దేనిని వేదసంవిదులు ♦ తెల్పెద రక్షర మన్న సంజ్ఞచే,
దేనిఁ బ్రవేశమొందురు య ♦ తిప్రవరుల్ ప్రవిముక్తరాగులై,
దేనినిఁ బొంద, వాంఛితమ ♦ తిం బొనరింతురు బ్రహ్మచర్యమా
స్థానముఁ గూర్చి నీకొఱకు సంగ్రహరూపముగా వచించెదన్॥

ఆ॥ వె॥ తనువునం గలట్టి ♦ ద్వారంబు లరికట్టి,
మనసు, హృదయ కమల ♦ మునను నిల్పి,
తనదు ప్రాణవాయు ♦ వును మూర్ధమందుంచి,
యోగ ధారణంబు ♦ నూనుచుండి, 12

తే॥ గీ॥ బ్రహ్మ పరమది "ఓం" అంచుఁ ♦ బరఁగు నొక్క—
అక్షరము నుచ్చరించు, చో ♦ యక్షరార్థ
మయిన నను సంస్మరించుచు, ♦ మెయిఁ దొఱంగి
చను నెవం, డాతఁ డుత్తమ ♦ స్థాన మొందు॥ 13

తే॥ గీ॥ ఇతర చింతలఁ దలపోయ ♦ కెవఁడు నన్నె
బ్రతికి యున్నంత కాలముం ♦ బ్రతి దినమ్ము
ధ్యాన మొనరించు, నిత్య యు ♦ క్తాత్ముఁ డగుచు,
అట్టి యోగికి సులభుండ ♦ నయ్య నేను॥ 14

తే॥ గీ॥ అనఘ ! ననుఁ బొందినట్టి మ ♦ హానుభావు
లుత్తమంబగు సంసిద్ధి ♦ నొందియుంట,
సకల దుఃఖాలయంబు, న ♦ శాశ్వతంబు,
నగు పునర్జన్మమును బొంద ♦ రయ్య, వారు। 15

తే॥ గీ॥ బ్రహ్మ లోకంబు దనుకను ♦ బరఁగు చుండు
నెల్ల లోకంబులు పునరా ♦ వృత్తి గలవి;
నన్నుఁ బొందిన వారలో, ♦ నర వరేణ్య !
తిరిగి జన్మంబు గాంచుట ♦ యెఱుఁగఁ బోరు॥ 16

తే॥ గీ॥ స్రష్టయైన చతుర్ముఖ ♦ బ్రహ్మయొక్క-
పగటి పరిమాణమది వేయి ♦ యుగము లంచు,
రాత్రియును నట్లె యుగసహ ♦ స్రం బటంచుఁ,
దా రహోరాత్ర పరిమితి ♦ ద్రష్ట లండ్రు॥ 17

కం॥ వ్యక్తము లఖిలములును, న
వ్యక్తంబున నుండి పుట్టుఁ, ♦ బగ లగుతఱి, నా
వ్యక్తములు లీనమగు న
వ్యక్తంబునయందె, రాత్రి ♦ వచ్చెడి వేళన్॥ 18

ఆ॥ వె॥ అట్టు లుద్భవించు ♦ ప్రాణి జాతం బెల్లఁ
బుట్టి పుట్టి యణఁగి ♦ పోవుచుండు
వశత లేమి రాత్రి ♦ వచ్చెడి తఱిఁ, బార్థ !
పగలు వచ్చునపుడు ♦ పరిభవ మొందు॥ 19

తే॥ గీ॥ కాని, యవ్యక్తమనిచెప్పు ♦ దీని కంటెఁ,
బరము, శాశ్వత, మన్య, మ ♦ వ్యక్తమైన
భావ మొదికద్దొ, యది నశిం ♦ పఁగఁ బోదు,
ప్రాణులెల్ల నశించిన ♦ ప్పటికి నైన॥ 20

తే॥ గీ॥ అనఘ! యవ్యక్తుఁ, డక్షరుం ♦ డనెడి వాఁడె
పరమగతి యంచు వేదముల్ ♦ పలుకుచుండు;
దేనినొందిన మఱియెవరు ♦ తిరిగి రారొ,
అట్టి యుత్కృష్ట పదము నా ♦ యది, కిరీటి! 21

తే॥ గీ॥ ఎల్ల భూతంబు లెవనిలో ♦ నిమిడి యుండు,
సర్వ మీజగ మెవనిచేఁ ♦ బర్వి యుండు,
అట్టి యుత్కృష్ట పురుషుఁ డ ♦ నన్యమైన
భక్తివలన సుసాధ్యుఁడౌ ♦ వాఁడు సుమ్ము! 22

తే॥ గీ॥ యోగు లేకాలమున మృతి ♦ నొంది యిటకు
మరలి వత్తురొ, మగుడ జ ♦ న్మంబు గాంచ,
మఱియు, నేకాలమున, నిఁకఁ ♦ దిరిగి రారొ,
వినుము తెల్పెదఁ దత్కాల ♦ వివరములను॥ 23

తే॥ గీ॥ అగ్నియును, జ్యోతియును, మఱి, ♦ యహము, శుక్ల
పక్షమును, నుత్తరాయణ ♦ వత్సరార్ధ,
మైన కాలంపుమార్గాన ♦ నరిగి, బ్రహ్మ
మొందుదురు బ్రహ్మవేత్తలౌ ♦ యోగిజనులు॥ 24

తే॥ గీ॥ అరయ, ధూమంబు, రాత్రియు, ♦ నటులె, బహుళ
పక్షమును, దక్షిణాయన ♦ వత్సరార్ధ,
మైన గతినేగు సామాన్యుఁ ♦ డైన యోగి
తిరిగి జన్మంబుఁగనుఁ, జంద్ర ♦ తేజ మొంది॥ 25

తే॥ గీ॥ రెండు తెగలైన యీశుక్ల ♦ కృష్ణగతులు
జగతికి స్థిరంబులంచు నెం ♦ చఁబడె శ్రుతుల;
మొదటి గతిచే, ననావృత్తిఁ ♦ బొందు, యోగి;
మఱి, ద్వితీయంపు గతిచేతఁ, ♦ దిరిగి పుట్టు॥ 26

ఆ॥ వె॥ ఈ గతి ద్వయంబు ♦ నెఱుఁగంగ నేర్చిన
యోగిజనుఁడు మోహ ♦ మొందఁ డెవఁడు;
కనుక, నీవు సర్వ ♦ కాలంబులందును,
యోగయుక్తి మెలఁగు ♦ చుండు, మనఘ! 27

తే॥ గీ॥ వేద, యజ్ఞ, తపో, దాన ♦ వితతి, యెట్టి
పుణ్య ఫలము బటంద్రో, త ♦ త్పుంజ మెల్లఁ
దృణముగా నెంచి, యాతత్త్వ ♦ మెఱుఁగఁ గల్గి,
పడయు, నుత్తమమౌ నాద్య ♦ పదము, యోగి॥ 28

ఇది శ్రీ లక్ష్మీనరసమాంబా హనుమయార్య పుత్త్ర,
కవిజన విధేయ, మయిలవర వంశీయ, వేంకటరామ నామధేయ
ప్రణీతంబైన " భగవద్గీతానువాదము " నందలి
' అక్షర పరబ్రహ్మ యోగ ' మను
ఎనిమిదవ యధ్యాయము
సంపూర్ణము.



శ్రీ

# భగవద్గీతానువాదము

## తొమ్మిదవ యధ్యాయము.

### రాజవిద్యారాజగుహ్యయోగము.

శ్రీభగవానుఁ డిట్లు చెప్పెను:

తే॥ గీ॥ ఎది యెఱింగి సంసృతినుండి ♦ యెడయఁ గలవొ,
గుహ్యములయందు నెయ్యది ♦ గుహ్యతమము,
అట్టి విజ్ఞాన సంయుక్త ♦ మైన జ్ఞాన
మిఁకఁ బ్రబోధింతు, ననసూయ ♦ నెసఁగు నీకు। 1

తే॥ గీ॥ పరమమగు విద్యయిది, యిద్ది ♦ పరమ గుహ్య;
మియ్యది పవిత్ర; మిద్ది యు ♦ త్కృష్టతమము;
అనుభవ సుగోచరంబు; ధ ♦ ర్మానుగతము;
సుసుఖ కరణీయ; మవ్యయ ♦ సుఖద, మనఘ! 2

తే॥ గీ॥ వినుమి: యీజ్ఞాన విజ్ఞాన ♦ విహిత మైన
ధర్మ పథమందు నశ్రద్ధఁ ♦ దవిలి నట్టి
నరులు ననుఁబొందఁ జాలక ♦ తిరుగు చుంద్రు
జన్మ మృత్యు స్వరూప సం ♦ సారమందు॥ 3

తే॥ గీ॥ అనఘ ! యీజగ మెల్ల, న ♦ వ్యక్త మూర్తి
నై రహించెడి నాచేత ♦ వ్యాప్త మయ్యెఁ;
బ్రాణు లెల్లను నాయాశ్ర ♦ యమున నుండ్రు;
వాని యాశ్రయమున నుండఁ ♦ బోను నేను॥ 4

తే॥ గీ॥ లేవు నాయందుఁ బ్రాణు, ల ♦ లేవు నగుటఁ;
గనుము నాయైశ్వరంపు యో ♦ గంబు నీవు;
నాస్వరూపంబు ప్రాణి జ ♦ న్మ భరణముల
సల్పునది యయ్యుఁ, గాదు తత్ ♦ సంస్థితంబు॥ 5

తే॥ గీ॥ అంతటను సంచరించు మ ♦ హానిలంబు
నిరత మాకాశమున నున్న ♦ సరణి తోఁప,
అఖిల భూతచయంబు నా ♦ యందు సతము
నిలిచియున్నట్లు బాగుగాఁ ♦ దెలిసికొనుము॥ 6

తే॥ గీ॥ ప్రాణి సంఘాత మెల్లఁ గ ♦ ల్పాంత మందు
నా నికృష్టంపుఁ బ్రకృతి న ♦ ణంగియుండు;
సృష్టి కాలంబునందుఁ ద ♦ జ్జీవకోటి
మఱల వెడలించుచుందు, నో ♦ కురువరేణ్య! 7

తే॥ గీ॥ ప్రకృతికిన్ లొంగి, యస్వతం ♦ త్రమయి యున్న
సకల మైనట్టి యీప్రాణి ♦ సముదయమును
మత్ప్రకృతిఁబూని, యుండుండి, ♦ మఱల మఱలఁ
బ్రభవ మొందించుచున్నాఁడఁ, ♦ బాండుపుత్త్ర!॥ 8

తే॥ గీ॥ అట్టి సృష్ట్యాది కర్మ చ ♦ యంబు నందుఁ,
దగులుచెంద, కుదాసీను ♦ పగిది నుండు
నాకుఁ దత్ కర్మచయము సుం ♦ తయును బాధ
కారణము గాదుసుమి, కురు ♦ వీరముఖ్య! 9

తే॥ గీ॥ అస్మ దధ్యక్షతా భావ ♦ మమరి యుంటఁ,
బ్రకృతి కనుచుండు సచరాచ ♦ రంపు జగతి;
మఱియు, నీహేతువుననె స ♦ మస్తమైన
సృష్ట జగమది విపరివ ♦ ర్తించు చుండు॥ 10

తేగీ॥ గీ॥ నిఖిల భూతేశ్వరుండనై ♦ నెగడు నాదు
పరమ భావంబు నెఱుఁగని ♦ పామరాళి
బుద్ధిజడత, నవజ్ఞ స ♦ ల్పుదురు, పార్థ!
మానవ శరీర ధారినై ♦ మసలు నన్ను॥ 11

కం॥ సమ్మోహనము, దనుజ సే
వ్యమ్మును, నగు నాసురంపుఁ ♦ బ్రకృతి నెససి, వ్య
ర్థమ్ములగు కర్మ, లాశలు,
వమ్మగు తెల్వియును, గల్గు ♦ వా రీ కుమతుల్॥ 12

తే॥ గీ॥ ఇఁక, మహాత్ములా, దైవ ప్ర ♦ కృతిని బూని,
భూత జాతంబునకు నేనె ♦ మూల మంచు,
అవ్యయుఁడనంచు, మద్భావ ♦ మరయఁ గలిగి,
నన్ను భజియించుచుందు ర ♦ నన్య మతిని॥ 13

తే. గీ.॥ యత్నగతులయి, దృఢ నియ ♦ మాఢ్యులనయి,
సంతతంబును నన్ను కీ ♦ ర్తింతు, రనఘ!
అచల భక్తి నమస్కృతు ♦ లాచరింత్రు;
నను నుపాసింత్రు నిత్యయు ♦ క్తిని జెలంగి॥ 14

తే. గీ.॥ జగతిఁ గొందఱు జ్ఞాన య ♦ జ్ఞమునఁ గూడ
నను యజించు, చుపాసింతు, ♦ రనుదినంబు;
నా యభిన్నత్వమో, ప్రభి ♦ న్నతమొ యనసి
విశ్వముఖునిగ భజియింత్రు ♦ వేయి గతుల॥ 15

కం.॥ నేనే క్రతువును, యజ్ఞము,
నేనే కవ్యమును, యజ్ఞ ♦ నియు తౌషధులున్,
నేనే మంత్రము, నాజ్యము,
నేనే యగ్నియు, హుతంబు ♦ నేనే, కిరీటీ! 16

తే. గీ.॥ ఏనె తండ్రిని సర్వమా ♦ సి జగతికిఁ,
దల్లియును, దాతయును, విధా ♦ తయును నేనె,
పావనము, వేద్యమును, నైన ♦ ప్రణవ మేనె;
ఋగ్యజుస్సామ వేదంబు ♦ లేనె, పార్థ! 17

తే. గీ.॥ పతియు, గతియును, సాక్షియుఁ, ♦ బ్రభుఁడ నేను;
శరణమును, నివాసుండను, ♦ సఖుఁడ నేను,
ప్రభవ, సంస్థితి, లయము లకా ♦ శ్రయము నేను,
చెడని బీజంబు నేను, ని ♦ క్షేప మేను॥ 18

తే॥ గీ॥ ఏనె లోకంబునకు వేడి ♦ నిచ్చుచుందు,
వానఁ గురిపింతుఁ, గురియుట ♦ మానిపింతు,
మృత్యురూపుండ నేనె, య ♦ మృతము నేనె,
సత్తనంగను నేనె, య ♦ సత్తు నేనె। 19

తే॥ గీ॥ ఋగ్యజుస్సామ పరులు స్వ ♦ ర్గేచ్ఛ నెనసి
సోమ రస పాన పాప సం ♦ శుద్ధి, నన్నుఁ
గ్రతువుల యజించి, యమల నా ♦ కంబు నొంది,
యనుభవింతురు దివ్య భో ♦ గాళి నందు। 20

తే॥ గీ॥ కాని, వా రావిశాల నా ♦ కమును గ్రోలి,
పుణ్యము క్షయింప నరుదెంతురు ♦ భువికి మఱల;
ఇటు, త్రయీ ధర్మమునె యాశ్ర ♦ యించు నట్టి
కామ కాములు రాకపో ♦ కలనె గాంతురు॥ 21

కం॥ ఇల నన్ననన్య గతిగన్
దలఁచు చుపాసింతు,రే జ ♦ నంబులు సతతం,
బల నిత్య యోగయుక్తా
త్ముల యోగక్షేమ మేనె ♦ పూనెదఁ, బార్థా ! 22

తే॥ గీ॥ ఇతర దేవతలన్ భజి ♦ యింతు రెవరు
తన్నిహితమైన భక్తి, శ్ర ♦ ద్ధా ప్రయుక్తి,
వారలును నన్నె యర్చించు ♦ వారు సుమ్మ
వారి యర్చన యవిధి పూ ♦ ర్వకమె యయ్యు॥ 23

తే॥ గీ॥ సర్వ యజ్ఞంబులకును నా ♦ స్తవము నెంచఁ,
గ్రోలు వాఁడను నేలికం ♦ గూడ నేనె;
యెవరు తాత్త్విక దృష్టి న ♦ న్నెఱుఁగకుంద్రొ
వారు భోగాశ్రయము నుండి ♦ జారు చుంద్రు॥ 24

తే॥ గీ॥ దేవతారాధకులు గాంత్రు ♦ దేవతలనె;
పితరులనె చేరుదురు పితృ ♦ వ్రత నిరతులు;
భూతగణ పూజకులు గాంత్రు ♦ భూతములనె;
నాదు భక్తులు నన్నె పొం ♦ దఁగల, రనఘ! 25

కం॥ సలిలమొ, పత్రమొ, పుష్పమొ,
ఫలమో, భక్తిమెయి నాకె ♦ వండిడునో, తత్
సలిలాదులె, నేఁ గ్రోలుదుఁ,
దలప నవి యతాత్మ భక్తి ♦ దత్తము లగుటన్॥ 26

కం॥ దేని నొనర్తువొ, తిందువొ,
దానంబెది యిడుదో, యెట్టి ♦ తపము సలుపుదో,
దేనిని వ్రేల్తువొ యగ్నిన్,
దానిని నాకర్పణం బొ ♦ నర్పుము, పార్థా! 27

తే॥ గీ॥ ఇట్లు సన్యాస యోగంబు ♦ నెనసితేని,
అశుభ, శుభ ఫల రూపకం ♦ బైన కర్మ
బంధమున నుండి నిర్ముక్తిఁ ♦ బడయఁ గలవు;
పడసి, నన్నుఁబొందెదవు సుమ్ము, ♦ పాండుపుత్ర! 28

తే॥ గీ॥ సర్వమౌ ప్రాణి జాతంబు ♦ సమమె నాకు;
లేఁడు ద్వేష్యుండు, ప్రియుఁడును ♦ లేఁడు నాకు;
అయిన, నెవ్వారు నను భక్తి ♦ మెయి భజింత్రొ,
వారియం దుందు, నాయందు ♦ వార లుంద్రు॥ 29

తే॥ గీ॥ అతి దురాచార యుక్తుఁడే ♦ యయ్యు, నెవఁడు
నన్ను భజియించుచుండు న ♦ నన్య భక్తి,
వాఁడు దృఢ నిశ్చయుండైన ♦ వాఁడు గాన,
సాధువే యంచు నెంచంగఁ ♦ జాలి యుండు॥ 30

తే॥ గీ॥ అతఁడు సత్వరగతిని ధ ♦ ర్మాత్ముఁ డగును;
జిరతమం బగు శాంతియుఁ ♦ జెందఁ గలఁడు;
నాదు భక్తుఁ డెవండు నె ♦ న్నటికిఁ జెడఁడ
టంచు నీవే ప్రతిజ్ఞ సే ♦ యఁగదె, పార్థ! 31

తే॥ గీ॥ పాపయోనులు, మఱి స్త్రీలు, ♦ వైశ్యజనులు;
నట్లె, పాద సముద్భవు ♦ లైన వారుఁ,
గోరి నన్నాశ్రయించెడి ♦ వారలేని,
వారుసైతము నుత్కృష్ట ♦ పదము గాంత్రు॥ 32

తే॥ గీ॥ అట్టియెడఁ, బుణ్యులైన బ్రా ♦ హ్మణులఁ గూర్చి,
భక్త రాజర్షులం గూర్చి, ♦ పలుక నేల? 32½
లోకమిద్ది యనిత్యమ్ముఁ, ♦ శోక మయము;
నిట జనింపంగ, నన్ భజిం ♦ చుటయె సుగతి॥ 33

కం॥ నను నెన్నిక మదినిలుపుము,
నను భక్తిం గొల్వు, మ్రొక్కు ♦ నలువు, నమస్సుల్
పొనరుపుము నాకె; యిటు లా
త్మను గూర్చిన, నన్నెపొందె ♦ దవు, మత్పరతన్॥ 34

ఇది శ్రీ లక్ష్మీనరసమాంబా మానుమగార్భ్య పుత్త్రి,
కవిజన విధేయ, మయిలవర వంశీయ, వేంకటరామ నామధేయ
ప్రణీతంబైన "భగవద్గీతానువాదము" నందలి
'రాజవిద్యా రాజగుహ్య యోగ' మను
తొమ్మిదవ యధ్యాయము
సంపూర్ణము.



శ్రీ

# భగవద్గీతానువాదము

## పదియవ యధ్యాయము.

### విభూతి యోగము.

శ్రీ భగవానుఁ డిట్లు చెప్పెను :

తే॥ గీ॥ అస్మ దుక్తుల సంప్రీతి ♦ నాలకించు
నీదు విహితంబుఁ గోరిన ♦ నెమ్మనమునఁ
బరమ మైనట్టి వచనంబు ♦ మఱల నీకుఁ
దెలుపనున్నాఁడ వినవె త ♦ ద్వివరములను॥ 1

తే॥ గీ॥ నా ప్రభావంబు దేవగ ♦ ణంబు లేని,
మఱి, మహర్షి చయంబేని ♦ నెఱుఁగ లేదు;
అమర సంఘంబునకును, మ ♦ హర్షులకును,
ఆది కారణ మేనె సు ♦ మ్మఖిల గతుల॥ 2

తే॥ గీ॥ మర్త్యులందు, నెవం డాత్మ ♦ మాహాత్మ్య మడఁచి,
ఆది విరహితు, నజుని, లో ♦ కాధి నాథు,
నన్నుఁ దెలియంగఁ జాలియు ♦ న్నాఁడొ, యాతఁ
డఖిల పాప వినిర్ముక్తి ♦ నందఁ గలఁడు॥ 3

తే॥ గీ॥ బుద్ధియును, జ్ఞానమును, నస ♦ మ్మోహతయును,
క్షమయు, సత్యంబు, నట్టులే, ♦ దమము, శమము,
వరుస సుఖదుఃఖములు, భయా ♦ భయ యుగంబుఁ,
బ్రభవ సంప్రాప్తియును, నభా ♦ వంబు నట్లె,
సమతయు, నహింసయును, మఱి, ♦ సంతసమును,
దపము, దానంబు, యశమును, ♦ నపయశంబు,-
అనెడి వేర్వేఱు భావంబు ♦ లఖిల భూత
తతికి నావల్లనే జని ♦ తంబు లగును॥ 4,5

తే॥ గీ॥ * ఎవరి సంతతియో, మహీ, ♦ నీప్రజాళి
అట్టి సప్త మహర్షులు, ♦ నటకు మున్ను
నాల్గురును, మనువులును, మ ♦ న్మానసమునఁ
బ్రభవ మొందిరి మద్గత ♦ భావు లగుచు॥ 6

తే॥ గీ॥ మనుజుఁ డెవఁ డీవచించెడి ♦ మద్విభూతి-
యోగము తెలియఁగ నేర్చునో ♦ యున్నయట్లు,
ఆతఁ డవికంప యోగ స ♦ మన్వితుఁడయి
యొసఁగుచుండును; సంశయం ♦ బిందు లేదు॥ 7

తే॥ గీ॥ ఏనె యీసర్వ సృష్టికి ♦ హేతువనియు,
సృష్ట జగమెల్ల మత్ప్రవ ♦ ర్తితమె యనియు,
ఎఱిఁగి నన్ను భజించుచుం ♦ దురు జగానఁ
గృతమనస్కులు భావన ♦ మేతు లగుచు॥ 8

---

* ఈపద్యము తిలక్ మహాశయుని వ్యాఖ్యానము ననుసరించుచున్నది.

తే॥ గీ॥ మద్గత ప్రాణ ధనులు, మ ♦ న్మానసులును,
అయి పరస్పర బోధనా ♦ భ్యాస మూని,
సతము ననుఁగూర్చి ముచ్చటల్ ♦ సల్పికొనుచు,
మించు సంతుష్టమతిని ర ♦ మించుచుంద్రు॥

తే॥ గీ॥ సంత తాభ్యస్త యోగ సం ♦ స్కార యుక్తి
ఎవరు సంప్రీతితో నను భజి ♦ యించు చుంద్రొ,
అట్టివారికి, మత్సుఖ ♦ ప్రాప్తిఁ గూర్చ,
నొసఁగుచున్నాఁడ నల బుద్ధి ♦ యోగ, మనఘ! 10

కం॥ వారికిఁ గృపఁజూపుటకే
వారల హృదయముల నిలిచి, ♦ భాస్వత్ జ్ఞానా
కార ప్రదీప కలనన్
వారల యజ్ఞాన తమము ♦ నాశ మొనర్తున్॥ 11

అర్జునుఁ డిట్లు పల్కెను:

తే॥ గీ॥ పరమ పావనుఁడవు పర ♦ బ్రహ్మ మీవె,
అల పరంజ్యోతి వీవె, లో ♦ కైక పూజ్య!
నిన్నుఁ బురుషుండటంచును, ♦ నిత్యుఁడంచు,
దివ్యు, డజుఁడు, విభుం, డాది ♦ దేవుఁడంచుఁ,
ప్రథితదేవర్షియైన నా ♦ రదుఁడు, నట్లె-
అసితుఁడును, దేవలుఁడు, వ్యాసుఁ ♦ డాది గాఁగ
వఱలు ఋషివర్యు లెల్లరుం ♦ బలుకుచుండు;
రదె స్వయమ్ముగ నీవచె ♦ ప్పెదవు నాకు॥ 12,13

తే॥ గీ॥ అనఘ! నీవిట నాకుఁ జె ♦ ప్పినది యెల్ల
సత్యమంచుఁ దలంతు ని ♦ స్సంశయముగ;
ఈ జగాన, సురాసురు ♦ లెవరు గాని,
నీదు వ్యక్తిని గనలేరు ♦ గాదె, కృష్ణ! 14

తే॥ గీ॥ భూత సృష్టి విధాయక! ♦ పురుషవర్య!
ప్రాణి నియమన కార్యని ♦ ర్వహణ దక్ష!
దేవదేవ! జగన్నాథ! ♦ నీవ నీదు
రూపు స్వయముగ నాత్మ నె ♦ ఱుఁగఁ గలవు॥ 15

తే॥ గీ॥ ఏ విభూతులచేత నీ ♦ వీజగంబు
లన్నియును బర్వి నిల్చితో, ♦ యట్టి నీదు
వైభవము లశేషముగఁ జె ♦ ప్పఁదగు దీవె;
నీ విభూతులు దివ్యముల్ ♦ గావె? కృష్ణ! 16

తే॥ గీ॥ సంతతం బెట్లు చింతన ♦ సల్పుచుండి
యెఱుఁగఁ గలనయ్య నిన్ను, యో ♦ గీంద్రముఖ్య!
మఱియు, నేయే స్వరూప సం ♦ భారమందు
నిన్ను ధ్యానింప నొప్పు, సం ♦ పన్నిధాన! 17

తే॥ గీ॥ నీ విభూతియు, నీయోగ ♦ భావ తతియు,
మఱల సెలవీయఁగదె సవి ♦ స్తరముగాఁగ;
అనఘ! భవదీయ యోగ క ♦ థామృతంబు
నెంత వినినను నాకు సం ♦ తృప్తి లేదు॥ 18

శ్రీ భగవానుఁ డిట్లు చెప్పెను :

తే॥ గీ॥ మంచి; దక్లె వచింతు నా ♦ మహిమములను;
గాని, తద్విస్తృతి యపార ♦ మైన కతన,
నాదు దివ్య విభూతి సం ♦ తతుల నిందు
ముఖ్యతను బట్టి వివరింపఁ ♦ బూను వాఁడ॥ 19

తే॥ గీ॥ సర్వ భూతాశయములందు ♦ సంస్థితమగు
నాత్మ యయ్యది నేనె యం ♦ చేరయు, మనఘ!
అఖిల భూత వ్రజంబున ♦ కాది నేనె,
అట్లె మధ్యంబు, నంత మ ♦ య్యదియు, నేనె। 20

తే॥ గీ॥ ప్రవిమ లాదిత్యులందు, వి ♦ ష్ణువును నేనె;
జ్యోతులం, దంశుయుక్త సూ ♦ ర్యుండ నేనె;
వీచెడి మరుత్తులందు, మ ♦ రీచి నేనె;
తారకాగణమందుఁ, జం ♦ ద్రముఁడ నేనె॥ 21

తే॥ గీ॥ వేదములయందు, సామాఖ్య ♦ వేద మేనె;
దివిజ సందోహమందు, వా ♦ సవుఁడ నేనె;
అఖిల కరణావళిఁ, మన ♦ స్సనున దేనె;
భూతములలోని చేతనా ♦ స్ఫూర్తి నేనె॥ 22

తే॥ గీ॥ రుద్రు లనువారిలో, శంక ♦ రుండ నేనె;
యక్ష రాక్షసులందు, ద్ర ♦ వ్యపతి నేనె;
వసు గణంబునయందుఁ, బా ♦ వకుఁడ నేనె;
పర్వతములందు మేరు ప ♦ ర్వతము నేనె॥ 23

తే॥ గీ॥ జగతిఁ గల్గు పురోహిత ♦ జనము లందుఁ,
బ్రముఖుఁడై తనరెడి బృహ ♦ స్పతిని నేనె;
దండ నాయకులందు, స్కం ♦ దుండ నేనె;
కల సరస్సులయందు, సా ♦ గరము నేనె॥ 24

తే॥ గీ॥ పృథివిఁ గల మహర్షులయందు ♦ భృగుఁడ నేనె;
వాగ్వితానంబునం, బ్రణ ♦ వంబు నేనె;
యజ్ఞ నిచయంబునన్, జప ♦ యజ్ఞ మేనె;
స్థావరంబులలో, హిమ ♦ శైల మేనె॥ 25

తే॥ గీ॥ సర్వ వృక్షంబులందు, న ♦ శ్వత్థ మేనె;
ప్రథిత దేవర్షులందు, నా ♦ రదుఁడ నేనె;
ప్రకట గంధర్వతతిఁ, జిత్ర ♦ రథుఁడ నేనె;
కపిలముని నేనె, సిద్ధ వ ♦ ర్గంబునందు॥ 26

తే॥ గీ॥ తొల్లి యమృతంబుతోడ ను ♦ ద్భూత మైన
యల్ల యుచ్చైశ్శ్రవము నేనె ♦ యశ్వకోటిఁ;
నేనె యైరావతంబు గ ♦ జేంద్ర వితతిఁ;
మానవులయందు, రాజును ♦ నేనె, పార్థ! 27

తే॥ గీ॥ ఆయుధములందు, నేనె వ ♦ జ్రాయుధంబు;
ధేనువులయందు, నల కామ ♦ ధేను వేనె;
ప్రభవ కారకులందు, ద ♦ ర్పకుఁడ నేనె;
సకల సర్పములందు, వా ♦ సుకిని నేనె॥ 28

తే॥ గీ॥ నాగులందు, ననంతుఁడఁ ♦ నాగ మేనె;
వరుణుఁడను నేనె, యుదక దే ♦ వతలయందు;
అర్యముఁడ నేనె, పితృదేవ ♦ తాళియందు;
దండనాథ్యక్షులందుఁ, గా ♦ లుఁడ నేనె॥ 29

తే॥ గీ॥ నేన ప్రహ్లాదుఁడను దైత్య ♦ నివహ మందుఁ;
గాలవేత్తలయందలి ♦ కాల మేనె;
మృగ సమూహంబునందు, మృ ♦ గేంద్ర మేనె;
గరుడుఁడను నేనె, పక్షి సం ♦ ఘాతమందు॥ 30

తే॥ గీ॥ జవము గలవానియందు, వా ♦ యువును నేనె;
రామచంద్రుండ నేనె, శ ♦ స్త్రభృతు లందు;
మత్స్య సందోహమునయందు ♦ మకర మేనె;
నదులలో నెల్ల జాహ్నవీ ♦ నదిని నేనె॥ 31

తే॥ గీ॥ సర్వ సర్గంబులకును, శ ♦ త్రుఘ్నణాథ్య !
ఆదిమధ్యాంతములు నేనె ♦ యంచుఁగనుము;
విద్య లందెల్ల, నధ్యాత్మ ♦ విద్య నేనె;
తర్క వాదించువారి వా ♦ దంబు నేనె॥ 32

తే॥ గీ॥ అరయఁగ, అకారమేనె, య ♦ క్షరములందు;
ద్వంద్వ మేనె, సమాస వి ♦ తాన మందు;
అక్షయంబగు కాల మ ♦ య్యాదియు నేనె;
సర్వతోముఖుఁడైన య ♦ బ్జజుఁడ నేనె॥ 33

తే॥ గీ॥ సర్వము హరించు మృత్యురూ ♦ పైత మేనె;
పుట్టఁబోయెడి వారికి ♦ మూల మేనె;
స్త్రీలయందుండు కీర్తియు, ♦ సిరియు, వాక్కు,
స్మృతియు, మేధయు, క్షమయును, ♦ ధృతియు, నేనె॥ 34

తే॥ గీ॥ సామజాలందునన్, బృహ ♦ త్సామ మేనె;
అలరు ఛందస్సులందు, గా ♦ యత్రి నేనె;
మాసతతి, మార్గశిరమన్న ♦ మాస మేనె;
ఋతువులందు, వసంతమన్ ♦ ఋతువు నేనె॥ 35

తే॥ గీ॥ ఒరుల వంచించు వానిలో, ♦ ద్యూత మేనె;
తేజము గలార లందలి ♦ తేజ మేనె;
నేనె జయము; ప్రయత్నంబు ♦ నేనె, పార్థ!
సత్త్వవంతులలో నుండు ♦ సత్త్వ మేనె॥ 36

తే॥ గీ॥ నేనె వాసుదేవుండ, వా ♦ ర్ష్ణేయులందుఁ;
పాండుపుత్త్రులలో, నర్జు ♦ నుండ నేనె;
వ్యాసుఁడను నేనె మునినిచ ♦ యంబు నందుఁ;
కవులలో, శుక్రుఁడనియెడి ♦ కవిని నేనె॥ 37

తే॥ గీ॥ నేనెసుమి శాసకులదండ ♦ నీతిఁ, బార్థ!
జయము వాంఛించు వారి నీ ♦ తియును నేనె;
మఱి, రహస్యంబులందెల్ల, ♦ మౌన మేనె;
జ్ఞానవంతుల యందలి ♦ జ్ఞాన మేనె॥ 38

తే॥ గీ॥ ఎల్ల ప్రాణుల కేది మూల ♦ హేతు వగునొ,
అట్టి బీజంబు నేనె యగు ♦ చేరయు, ననఘ!
ఈ చరాచర భూత వి ♦ స్తృతిని, పార్థ!
ననువినా, వసియింపఁగ ♦ గలది లేదు। 39

తే॥ గీ॥ మద్విభూతులు కల్యాణ ♦ మయములు లరయ;
వీని కంతంబు లేదు సుం ♦ తేనిఁ, పార్థ!
యిట్టి నాదౌ విభూతి వి ♦ స్తృతిని, యిపుడుఁ
దెల్పియున్నాఁడ నీ కేక ♦ దేశముగను। 40

కం॥ ఏదియెది విభూతివంతం,
బెది శ్రీమంతంబు, స్వచ్ఛ, ♦ మెది యూర్జితమో,
అది నా తేజోంశంబున
నుదయంబై నదిగ నెఱుఁగు, ♦ మోయి కిరీటీ! 41

తే॥ గీ॥ మఱియు, నీవిట్టు లింతగా ♦ మద్విభూతి
నెఱుఁగ వలసిన పనియేమి? ♦ వరగుణాఢ్య!
అఖిలమగు నీజగత్తు నే ♦ కాంశమునను
బట్టియున్నాఁడ; విదితలం ♦ పఁగదె, పార్థ! 42

ఇది శ్రీ లక్ష్మీనరసమాంబా హనుమయార్య పుత్త్రి,
కవిజన విధేయ, మయిలవర వంశీయ, వేంకటరామ నామధేయ
ప్రణీతంబైన "భగవద్గీతానువాదము" నందలి
'విభూతి యోగ' మను
పదియవ యధ్యాయము
సంపూర్ణము.



శ్రీ

# బగవద్గీతానువాదము

## పదునొకండవ యధ్యాయము.

## విశ్వరూపసందర్శనయోగము.

అర్జునుఁ డిట్లు పల్కెను :

తే॥ గీ॥ నీవు నననుగ్రహింపంగ ♦ నెంచి, యెట్టి
పరమము, నిగూఢ, మాత్మత ♦ త్త్వవిషయికము,
నైన వాక్యాళి పలికితో, ♦ యట్టిదాని
వలన నా యీవిమోహంబు ♦ తొలఁగిపోయె॥ 1

తే॥ గీ॥ ప్రాణిజాతంపు సంభవ ♦ ప్రళయములను
విస్తరంబుగ నీవల్ల ♦ వింటిఁగాదె;
ఆలకించితినయ్య, కం ♦ జాయతాక్ష!
అవ్యయంబగు నీదుమా ♦ హాత్మ్యమదియు॥ 2

కం॥ సరి; యిట భవదీయంబగు
స్వరూపమది యెట్టిదంచు ♦ వచియించితివో,
పరమేశ! యట్టి నీ యై
శ్వరరూపముఁ జూడ నింక ♦ వాంఛ పొడమెడిఁ॥ 3

ఆ॥ వె॥ అనఘ ! తత్ స్వరూప ♦ మును జూడ నాకు సా
ధ్యం బటంచు నెమ్మిఁ ♦ దలఁతువేని,
నాశ రహితమై త ♦ నర్చెడి భవదీయ
రూప మింక నాకుఁ ♦ జూపఁ గదవె। 4

శ్రీభగవానుఁ డిట్లు చెప్పెను :

తే॥ గీ॥ పలు తెఱంగులు గల్గి, ది ♦ వ్యత్వ మొనసి,
పెక్కు వర్ణంబు, లాకృతుల్ ♦ పెక్కు గల్గి,
శతములో, మఱియుఁక సహ ♦ స్రములో యనఁగ
ఎసఁగు నారూపముల్ గాంచ ♦ వే, కిరీటి ! 5

తే॥ గీ॥ ద్వాదశాదిత్యులను, అష్ట ♦ వసు చయంబు,
రుద్రులను, నశ్వుల, మఱి, మ ♦ రుద్గణంబు,
ఇంక, నెన్నండు మును చూచి ♦ యెఱుఁగనట్టి
అద్భుతము లెన్నొ గనుము, పృ ♦ థాత్మజాత ! 6

తే॥ గీ॥ అస్మదీయ శరీరంబు ♦ నందుఁ, బార్థ !
జంగమ స్థావ రాత్మక ♦ సకల జగతి
నిదిగొ ! యేకస్థముగఁ జూడు ♦ మిప్పు; డింక
దేనిఁగన నెంతొ, చూడు మ ♦ ద్దాని నేని॥ 7

తే॥ గీ॥ కాని, యీనీదు కన్నుల ♦ తోనె నన్నుఁ
గాంచఁగా నీకు శక్యంబు ♦ గాదు; గాన,
నిచ్చుచున్నాఁడ నిదె దివ్య ♦ దృష్టి నీకుఁ;
గనుము నాయైశ్వరంపు యో ♦ గంబు, దాన॥ 8

సంజయుం డిట్లు పల్కెను :

తే॥ గీ॥ ఇట్లు కృష్ణుండు పరమయో ♦ గేశ్వరుండు,
పలికి, యటుపైనిం బాండు భూ ♦ ప తనయునకు,
ఐశ్వరంబును, బరమము ♦ నైన తనను
విశ్వరూపంబుం జూపెం, బృ ♦ థ్వీ విరాజ ! 9

తే॥ గీ॥ అయ్యది యనేక వదన నే ♦ త్రాన్వితంబు,
అద్భుతానేక సందర్శ ♦ నాత్మకంబు,
అంచితానేక దివ్య భూ ♦ షాన్వితంబు,
ఉద్యతానేక దివ్యాయు ♦ ధౌఘ, మనఘ ! 10

తే॥ గీ॥ దివ్య మాల్యాంబరములతోం ♦ దేజరిలుచు,
దివ్య గంధంబు మేన నెం ♦ తే ధరించి,
అద్భుతావహ రూపుం డ ♦ నంతుండైన
విశ్వముఖుండగు విభుండు గా ♦ న్పించె నపుడు॥ 11

తే॥ గీ॥ గగన పథమున, నొకసాటి ♦ కాలమందు,
వేయి సూర్యుల సంశోభ ♦ వెడలెనేని,
ఎట్టి తేజంబు పొడమునో, ♦ యట్టి తేజ
మ మ్మహాత్ముని కాంతి కీ ♦ డనంగం జెల్లు॥ 12

ఆ॥ వె॥ బహు విధంబులుగను ♦ బ్రవిభక్త మైనట్టి
అఖిలమైన జగతి, ♦ యవనినాథ!
దేవదేవు కృష్ణు ♦ దేహమం దేకస్థ
మగుట గాంచె నప్డు ♦ డర్జునుండు॥ 13

తే॥ గీ॥ దాన, విస్మయావిష్ట చే ♦ తస్కుఁ డగుచుఁ,
దనువు గగ్గురుపాటొందఁ, ♦ దనదు శిరము
వంచి, ప్రణమిల్లి, కేల్మోడ్చి, ♦ పార్థుఁ డపుడు
కృష్ణదేవునితోడ నీ ♦ రీతిఁ బలికె॥ 14

అర్జునుఁ డిట్లు ప్రశ్నించెను :

తే॥ గీ॥ దేవ! నీదేహమునఁ గాంతు ♦ దేవతలను;
గాంతు భూత విశేష సం ♦ ఘంబు లెల్లఁ;
బద్మ సంస్థితుఁ డీశుఁడౌ ♦ బ్రహ్మఁ గాంతుఁ,
గలఋషీంద్రుల, దివ్యోర ♦ గములఁ గాంతు। 15

తే॥ గీ॥ బహు భుజోదర బహునేత్ర ♦ వక్త్రు, నిన్ను,
అఖిల దిశలను గనెద న ♦ నంత రూపుఁ,
గాంతునేగాని, విశ్వేశ! ♦ కాంచ లేను
నీదు తుది మొదల్ మధ్యముల్, ♦ విశ్వరూప! 16

చ॥ సరవిఁ,గిరీటముల్,గదయుఁ♦జక్రముఁదాల్చి, కాంతిపుంజమై
పరఁగుచు, సర్వదిక్తతుల♦భాసిలుచుండి, ప్రదీప్తకీలి భా
స్కరనిభ కాంతిసంతతి నె♦సంగు నమేయు, సుదుర్నిరీక్ష్యు, ని
న్నురుతరవిశ్వమంతట,న♦హో!కనుచుంటినికండ్లముందటన్॥

మ॥ ఎఱుఁగంగాఁదగు నుత్తమాక్షరుఁడ వీ♦వే,యీజగత్తంతకుం
బర మైనట్టి నిధాన మీవె గద, స♦ర్వవ్యాపి!, నీవేగదా
చిరధర్మ ప్రతిపాలకుండ, వవినా♦శీభూత రూపుండవుం,
పర మొప్పంగఁ బురాణపూరుష చిర♦ఖ్యాతుండ వీవేగదా॥

తే॥ గీ॥ ఆది మధ్యాంత రహితు, న ♦ నంత వీర్యు,
అపరిమిత బాహు, సూర్య శ ♦ శాంక నేత్రు,
దీప్త హుతభుఙ్ముఖుని నిన్, స్వ ♦ తేజమున జ
గత్తు నుడికించు వానిఁగాఁ ♦ గాంచుచుంటి॥ 19

తే॥ గీ॥ దేవ! భూనభోంతరమును, ♦ దిక్కు లెల్ల,
ఒక్క నీరూపుచేత నే ♦ పిక్కటిల్లె;
భయద, మద్భుత, మీస్వరూ ♦ పంబుఁ గాంచి
కలఁగుచున్నవి ముజ్జగం ♦ బులు, మహాత్మ! 20

తే॥ గీ॥ చొచ్చుచున్నారు నిన్ను నీ ♦ సురలు, దేవ!
వేడుచున్నారు కేల్మోడ్చి ♦ భీతి కొంద;
అలమహర్షులు సిద్ధులున్ ♦ స్వస్తి యంచుఁ,
బొగడుచున్నారు నిన్నిదే ♦ పుష్కలముగ॥ 21

తే॥ గీ రుద్ర, రవి, వసు, సాధ్య, మ ♦ రుద్గణంబు,
అశ్వి, విశ్వాస్వులును, నూష్మ ♦ పావళియును,
యక్ష గంధర్వ సిద్ధులున్, ♦ రాక్షసులును,
నిన్నె యాశ్చర్యమునఁ గాంచు ♦ చున్నవారు॥ 22

చ॥ బహువదనంబు, లక్షులును, ♦ బాహువు, లూరువులుం, బదంబులున్,
బహుజఠరవ్రజంబులును, ♦ స్ఫార భయంకరరూప దంష్ట్రలున్,
రహిఁగలయట్టి నీఘన త♦రంబగురూపముఁగాంచి లోకముల్
తహతహలాడు; నేనునిటఁ♦దల్లడమందుచునుంటినట్టులే॥ 23

తే॥ గీ॥ వివిధవర్ణుని, నంబర ♦ స్పృశుని దీప్తుఁ,
ప్రజ్వల విశాల నేత్రుని, ♦ వ్యాత్త వదను,
నిన్నుఁగని, లోనుభీతిల్లి ♦ యున్న నాకు
రాదు ధైర్యంబు, శాంతియు ♦ లేదు, దేవ! 24

తే॥ గీ॥ భయద దంష్ట్రలఁ గలిగి, యా ♦ ప్రళయ కాల
వహ్ని తుల్యంబులైన నీ ♦ వదనములను
జూచి దిక్కులు గనలేను, ♦ సుఖముఁగాంచ;
నా కికఁ బ్రసన్నుఁడవు కమ్ము, ♦ లోకనాథ! 25

తే॥ గీ॥ రాజ యుతులైన యీధార్త ♦ రాష్ట్ర శతము,
ద్రోణ భీష్ము, లీ సూతపు ♦ త్రుండు నట్లె,
ఆత్మ పక్షంపుఁ బ్రముఖ యో ♦ ధావళియును,-
వికృత దంష్ట్రలచేత వి ♦ భీతిఁ గొల్పు
నీ ముఖంబులఁ జొత్తురు ♦ నిల్వలేక;
అందుఁ గొందఱు నీపండ్ల ♦ సందు లందుఁ
జిక్కికొని చూర్ణితంబైన ♦ శీర్ష వితతిఁ
గానిపించుచునున్నారు ♦ కండ్ల యెదుట॥ 26,27

తే॥ గీ॥ అఖిల కల్లోలినీ ప్రవా ♦ హంబు లెట్లు
కడలినే చేరు, తదభిము ♦ ఖంబులగుచు,
అట్లె, యంతట మండు నీ ♦ యాస్యములను
జొచ్చుచున్నార లీమర్త్య ♦ శూరు లిపుడు॥ 28

తే। గీ॥ మిడుత లెట్టుల, మడియంగ, ♦ వడివడిగను,
ప్రోజ్జ్వల జ్వాలలోనికి ♦ నుఱుకు చుండు,
అట్లు, నాశంబు కొఱకు లో ♦ కాళి గూడ,
వడిగఁ జొచ్చును భవదీయ ♦ వదనములను॥ 29

తే। గీ॥ జ్వలిత ముఖములచేత, నీ ♦ జగము లెల్ల
మ్రింగు, చాస్వాదనం బొన ♦ రింతు వీవు;
త్వ ద్భయంకర కాంతి ప్ర ♦ భావ గరిమ,
నిండి తపియించుచున్న దీ ♦ నిఖిల జగతి॥ 30

తే। గీ॥ ఇంత యుగ్రాకృతి వెవండ ♦ వీవు చెపుము;
సర్వ ప్రసన్నతఁ జూపుము; ♦ నతు లొనర్తు;
ఆద్యుఁడగు నిన్నుఁ దెలియంగ ♦ నాసఁగొందు;
ఎఱుఁగ లేకుంటిఁ గద నీ ప్ర ♦ వృత్తి యెదియొ॥ 31

శ్రీ భగవానుఁ డిట్లు చెప్పెను:

ఉ। కాలుఁడ లోక నాశమున♦కై యిట ఘోరతర స్వరూపముం
దాలిచినాఁడ; నీభరత ♦ ధాత్రిని ప్రాణుల సంహరింప నీ
వేళఁ దొడంగువాఁడ; నిఁక,♦వీరుఁ డొకండునుగాంచనోచమూ
జాలములందుఁ దాఁబ్రతుకఁ ♦ జాలఁడు, నీ విట లేకపోయినన్॥

తే। గీ॥ కనుక, నని సేయు లెమ్ము; వి ♦ ఖ్యాతి గాంచు;
మఖిల రాజ్యంబు సేవింపు ♦ మరుల గెల్చి;
వీర లెల్లర, నేన చం ♦ పితిని మున్నె;
పాండవేయా! నిమిత్త మా ♦ త్రుండ వగుము॥ 33

తే॥ గీ॥ నేనె నిహతులఁ జేసిన ♦ * ద్రోణ భీష్మ
కర్ణ సైంధవు లాదిగాఁ ♦ గల్గు వీర–
యోధులను జంపుమిఁక; భయ ♦ మొందవలదు;
కదన మొనరింపు; మని గెల్వఁ ♦ గలవు రిపుల॥ 34

తే॥ గీ॥ హరి యిటుల్ పల్క నర్జునుం ♦ డాలకించి,
వడఁకుచును, దోసిలొగ్గుచుఁ ♦ బ్రణతులిడుచు,
మఱిమఱి విభీతి గనుచు, న ♦ ప్రమత్త మెసఁగ,
హరికి నిటుపల్కె గద్గద ♦ స్వరముతోడ॥ 35

మ॥ ఘనమా నీదగు కీర్తిచే సకలలో♦క శ్రేణి యెంతేని హృ
ష్ట్యనురాగంబులు గాంచుచుండుటయు, దై♦త్యవ్రాతముల్ హెచ్చు భీ
తిని సర్వాశలఁబర్వులెత్తుటయు, భ♦క్తి క్షిసిద్ధసంఘంబు లె
ల్ల నమస్కారము లాచరించుటయుఁ,జా♦లన్ యుక్తమే, శ్రీహరీ!

---

* ద్రోణశబ్దములోని "ణ" కారము అసలులో "న" కారమే యనుటకు:

"ధాప్పృవస్యజ్యతిభ్యోనః॥ ఉ॥ సూ॥ కృ, వృ(వృ) జ్యా, సి, దుఃపస్యని స్వపిభ్యోనిత్. ఏభ్యోనప్రత్యయోనిత్స్యాత్.

ని॥ ద్రోణో ఒ స్త్రీ ద్రోమాఢ కేస్యా
దాఢకాది చతుష్టయే
పుమాన్ కృపీపతౌకృష్ణ
కాకేస్త్రీనీవృదంతరే॥ [కౌముద్యామ్]

అను ప్రమాణము గుంటూరు హిందూకాలేజి ప్రధాన సంస్కృతో పాధ్యాయులగు శ్రీ పల్లె పూర్ణప్రజ్ఞాచార్యులవారి వలన ననుగృహీతము.

తే॥ గీ॥ ఘనతరుండగు బ్రహ్మాదే ♦ వునికిఁ గూడ
మూలమగు నీకు జనులేల ♦ మ్రొక్కకుంద్రు? 36
అనఘ, సదసత్పరంబైన ♦ యక్షరంబ
నీవె, లోకవాస ! యనంత ! ♦ దేవదేవ ! 37

తే॥ గీ॥ మొదటి దేవుండవు, పురాణ ♦ పూరుషుండ;
వఖిల విశ్వంబునకుఁ బరం ♦ బైన నిధివి;
వేత్తవును, బరంధామంబు, ♦ వేద్య మీవె;
విశ్వమెల్ల నీచేత వ్యా ♦ పింపఁబడియె॥ 38

తే॥ గీ॥ అనిల, యమ, వహ్ని, వరుణ, శ ♦ శాంకు లీవె;
ధాతయును, మఱి, ధాతకుం ♦ దండ్రివీవె;
ప్రణతు లివెగొన్ము, వేనవేల్ ♦ ప్రణతు లిడుదు;
మ్రొక్కు లిడెదను, మఱిమఱి, ♦ మ్రొక్కు లిడుదు॥ 39

తే॥ గీ॥ అభిముఖంబుగఁ, బృష్ఠంబు ♦ నందు, నింక
సర్వ దిశలందు, నిదె నమ ♦ స్కార మిడుదు;
అమిత బలవిక్రమాఢ్యుండ ♦ వయ్య నీవు;
సర్వుఁడవు, సర్వమున నెన్న ♦ పర్వి యుంట॥ 40

తే॥ గీ॥ ఇట్టి నీదగు మహిమంబు ♦ నెఱుఁగ లేక
నిన్నుఁ బ్రమాదంబుననో, లేక ♦ ప్రణయముననో,
ఓయి కృష్ణా ! సఖా ! యాద ♦ వా ! యటంచు
ఈడువాఁడని, దురుసుగా ♦ నాడినదియు,

తే॥ గీ॥ అప్రమేయుండవగు నిన్ను ♦ హాస్యమునకు,
శయన, విహరణ, భోజ, నా ♦ సనములందు,
ఒంటిగనో, గోష్ఠినో, చేసి ♦ యుండఁబోలు
చులుకదనమును, మన్నింప ♦ వలయు, దేవ! 41, 42

చం॥ అరయఁ, జరాచరంబులగు ♦ ప్రాణులకెల్లను దండ్రి నీవె,స
ద్గురుఁడవు నీవె; శ్రేష్ఠుఁడ; వ ♦ కుంఠిత పూజ్యత గల్గువాఁడవున్;
మఱి, జగతీ త్రయంబున స♦మానుఁడు లేఁడుగదయ్య నీకు;నో
నిరతిశయ ప్రభావ! యిఁక ♦ నీ కధికుం డెవఁడుండ నోపెడిన్॥43

తే॥ గీ॥ కనుక, మెయివంచి, ప్రణమిల్లి, ♦ వినుతు, నీశు,
నిన్ను వేడెద, సైపవే ♦ నన్ను, దేవ!
తండ్రి కొమరుని, మిత్రుండు ♦ తనదు సఖునిఁ,
బ్రియుఁడు ప్రియురాలి, సైచెడి ♦ రీతి పోనఁగ॥ 44

కం॥ మును చూడనియీరూపుం
గని హర్షించియును, నాత్మ ♦ గతిని విభీతిం
గనుచుంటిఁ; బ్రసన్నత నీ
వెనుకటి రూపమునె కాని ♦ పించవె యిఁకన్॥ 45

తే॥ గీ॥ అల కిరీట, గదా, చక్ర ♦ ములనుదాల్చి—
చెలఁగు నీరూపు గాంచ వాం ♦ ఛింతు నిపుడు;
వేయి బాహువులన్ వెల్గు ♦ విశ్వమూర్తి!
ఆ చతుర్భుజ రూపాన ♦ నమరు మింక॥ 46

శ్రీ భగవానుఁ డిట్లు చెప్పెను :

తే॥ గీ॥ పార్థ ! నా ప్రసన్నత్వంబు ♦ వలన నీకుఁ
ద్వ దితరులచేత మునుచూడఁ ♦ బడని యిట్టి
ఆద్య, పూర్ణ, తేజోమయమ్ము, ♦ సంత, పరమ
రూప మాత్మయోగంబుచేఁ ♦ జూపినాఁడ॥ 47

తే॥ గీ॥ ఇట్టి నారూపు గనినాఁడ ♦ వీ వొకండవె;
అన్య లాగమ పఠనంబు, ♦ లధ్వరములు,
దానముల్, క్రియ, లుగ్రంపుఁ ♦ దపము లెన్ని
సల్పియైన, ధాత్రి నరుఁ గాంచఁ ♦ జాల రిట్లు॥ 48

తే॥ గీ॥ ఇట్టి నాదు భయంకరా ♦ కృతిని జూచి
వ్యథపడకు, భావ వికలత్వ ♦ మందఁబోకు;
గత విభీతిని, సంప్రీత ♦ మతిని, గాంచు
మీవుగోరిన నారూప ♦ మిదిగో మరల॥ 49

సంజయుఁ డిట్లు పలికెను :

తే॥ గీ॥ కృష్ణుఁ డిటుపల్కి, నరుఁడు గో ♦ రిన విధాన
స్వీయ పూర్వాకృతిని గాని ♦ పించె మరల;
అట్లు, సౌమ్యాకృతుండయి, ♦ య మ్మహాత్ముఁ
డులుకుచుండెడి యర్జును ♦ నూఱడించె॥ 50

అర్జునుఁ డిట్లు పలికెను :

స్వామీ ! యీ సౌమ్యంబౌ
నీ మనుజాకృతిని గాంచి, ♦ నెమ్మది గంటిన్,
నామనసు మనసులోఁ బడె,
నే మనుజులలోనఁబడితి ♦ నిపుడు, మహాత్మా! 51

శ్రీ భగవానుఁ డిట్లు చెప్పెను :

తే॥ గీ॥ విజయ ! నీ విపుడుఁగన్న నా ♦ విశ్వరూప-
మది సుదుర్దర్శమయ్యె త్వ ♦ దన్య జనుల;
కట్టి మద్రూప దర్శన ♦ ప్రాప్తి కొఱకు
అమరు లేనియు సంతతం ♦ బభిలషింత్రు॥ 52

కం॥ ఏగతి నీ కగపడితినో,
ఆగతి ననుఁగన నశక్య ♦ మవని స్థలిపై,
ఆగమ పఠనంబున నేఁ,
యాగ, తపో, దానముల నో ♦ సత్క్రియలనైనన్॥ 53

తే॥ గీ॥ ధర, ననన్యంపుభక్తిచే ♦ తన, సుసాధ్య,
మివ్విధిని విశ్వరూపినై ♦ యెసఁగునన్నుఁ,
గల్గ యథార్థంపురీతిని ♦ దెలియుటకును,
జూచుటకును, పూర్ణంబుగాఁ ♦ జొచ్చుటకును॥ 54

తే॥ గీ॥ మత్సమర్పితకర్ముఁడున్ ♦ మత్పరముఁడుఁ,
గరము మత్భక్తుఁడున్, సంగ ♦ విరహితుండుఁ,
బ్రాణి సర్వంబునందు ని ♦ ర్వైర భావ
మొందియుండెడివాఁడు, నన్ ♦ బొందుఁ; బార్థ ! 55

ఇది శ్రీ లక్ష్మీనరసమాంబా హనుమయార్య పుత్త్ర,
కవిజన విధేయ, మయిలవర వంశీయ, వేంకటరామ నామధేయ
ప్రణీతంబైన "భగవద్గీతానువాదము" నందలి
'విశ్వరూప సందర్శన యోగ' మను
పదునొకండవ యధ్యాయము
సంపూర్ణము.



శ్రీ

# భగవద్గీతానువాదము

## పండ్రెండవ యధ్యాయము.

### భక్తియోగము.

అర్జునుఁ డిట్లు ప్రశ్నించెను :

తే॥ గీ॥ నిత్యయుక్తాత్ములై యిట్లు ♦ నిన్నుఁ గొల్చు
నట్టి భక్తులో, లేక, య ♦ వ్యక్తుఁ డైన
అక్షరు నుపాసనము చేయు ♦ నట్టి వారో,
యిరు తెగల, యోగవిత్తము ♦ లెవరు ? కృష్ణ !

శ్రీ భగవానుఁ డిట్లు చెప్పెను :

తే॥ గీ॥ అనయమును మానసంబు నా ♦ యందె నిల్పి
సతత యుక్తాత్ములై, కడు ♦ శ్రద్ధతోడ
న న్నుపాసించు భక్తిసం ♦ పన్ను లెవరో
వారు, నామతమున, యోగి ♦ వర్యు, లనఘ ! 2

తే॥ గీ॥ కాని, యెవ, రింద్రియాళి ని ♦ గ్రహ మొనర్చి,
సర్వ భూత హిత క్రియా ♦ సక్తి గలిగి,
అన్ని యెడలను సమబుద్ధు ♦ లై రహించి,
నిర్ణయాతీతు, నవ్యక్తు, ♦ నిఖిలగతుని,

తే॥ గీ॥ అచలుఁ, గూటస్థు, ధ్రువు, నచిం ♦ త్యస్వరూపు,
అక్షరుని * (నిర్గుణబ్రహ్మ) ♦ మాత్మగతిని
బర్యుపాసింతురో, తద ♦ వ్యక్త పరులు
నన్నెసుమి పొందుచున్నారు, ♦ నరవరేణ్య ! 3, 4

తే॥ గీ॥ అయిన, నాయాస మధిక, మ ♦ వ్యక్తమందుఁ
గోరిక గల (నిర్గు) ణోపాస ♦ కులకుఁ, బార్థ !
అవని, దేహధారులకు, న ♦ వ్యక్త నిష్ఠ
ప్రాప్త మగుటది, కష్టత ♦ రంబు గాదె॥ 5

తే॥ గీ॥ కాని, యెవ్వా, రనన్య యో ♦ గమునె పూని,
సర్వ కర్మలు నాయందె ♦ సన్న్యసించి,
నేనె యుత్తమగతి యన్న ♦ నిశ్చయమున
నన్నె భజియించుచుంద్రో ధ్యా ♦ నంపు గరిమ,

తే॥ గీ॥ అట్టి మన్నిహిత మనస్కు ♦ లైన భక్త
జనుల సత్వరగతి నేనె ♦ జన్మ మృత్యు
సంయుతంబైన సంసార ♦ జలధి నుండి
ఉద్ధరించెడి వాఁడనై ♦ యుందుఁ, బార్థ ! 6,7

తే॥ గీ॥ మనసు నాయందె స్థిరముగా ♦ నునుచు మయ్య;
బుద్ధి నాయందె చొప్పింపఁ ♦ బూనుమయ్య;
అంత, నాయందె నీవు వ ♦ సింతువయ్య;
సందియంబిందు లేదయ్య, ♦ సవ్యసాచి ! 8

* ఇయ్యది శంకరాభిప్రాయము ననుసరించుచున్నది.

తే॥ గీ॥ చిత్త మిట్టుల నాయందె ♦ స్థిరతనిలిపి-
యుంచఁగల శక్తి నీకు లే ♦ కుండెనేని,
అల ("పతంజలి") యోగంబు ♦ నభ్యసించి
పడయఁగోరుము నను దాని ♦ వలనఁ, బార్థ! 9

తే॥ గీ॥ అట్టి యభ్యాసమున కోప ♦ వైతివేని,
మత్ప్రియాచరణాసక్త ♦ మతివి కమ్ము;
అట్లు మత్ప్రీతికేనిఁ గ ♦ ర్మాళి సేయ
మోక్షరూపకమగు సిద్ధిఁ ♦ బొందఁగలవు॥ 10

తే॥ గీ॥ దీనిఁజేయుటకును జాల ♦ వేనిఁ, బిదప
నస్మదీయంపు యోగంబు ♦ ననుసరించి,
నియత మానస యుతుఁడవై ♦ నిఖిల కర్మ
ఫలపరిత్యాగ మొకటైన ♦ సలుపు, మనఘ! 11

తే॥ గీ॥ జ్ఞాన మభ్యాస యోగంబు ♦ కంటె మేలు;
జ్ఞానమున కంటె మేలు ధ్యా ♦ నంపుఁ గల్మి;
అంతకంటె ఫలత్యాగ ♦ మధిక తరము;
ఫల పరిత్యాగమున, శాంతి ♦ గలుగుఁ బిదప॥ 12

తే॥ గీ॥ సర్వ భూతాళియెడను ద్వే ♦ షంబులేక,
మిత్రుఁడై, వ్యాప్తకారుణ్య ♦ మిళితుఁడునయి,
నిర్వృతాహంకృతియు, మఱి, ♦ నిర్మముఁడును,
క్షమియు, సుఖదుఃఖ సమభావ ♦ సంయుతుఁడును,

తే॥ గీ॥ నిరత సంతుష్ట చిత్తుఁడుఁ, ♦ నియత మతియు,
యోగిజనుఁడును, దృఢ నిశ్చ ♦ యుండునునయి,
తన మనోబుద్ధులను మద ♦ ర్పణము చేయు
నట్టి మద్భక్తుఁడే ప్రియుఁ ♦ డయ్యె నాకు॥ 13, 14

తే॥ గీ॥ భయము చెందదు లోక మె ♦ వ్వాని వలన;
ఎవఁడు లోకంబు వలన భీ ♦ తివడఁబోఁడో;
ముదము, నీర్ష్యయు, నుద్వేగ ♦ మును, భయంబు,
వీడునెవ్వాఁడు, వాఁడెపో ♦ ప్రియుఁడు నాకు॥ 15

తే॥ గీ॥ కోరికలు లేనివాఁడు, ద ♦ క్షుండు, శుచియు,
గతవిచారుండు, స్వపర ప ♦ క్ష రహితుండు,
అఖిల కర్మజఫలపరి ♦ త్యాగయుక్తుఁ,
డైన మద్భక్తుఁడే ప్రియుఁ ♦ డయ్యె నాకు॥ 16

తే॥ గీ॥ ఎవఁడు పొంగఁడో, ద్వేష వి ♦ కృతిఁ గనండో,
కోర్కి చెందఁడో, దుఃఖానఁ ♦ గ్రుంగఁబోఁడో,
ఆగత శుభాశుభ ద్వయ ♦ త్యాగి యెవఁడో,
అట్టి భక్తుండె మత్ప్రియుఁ ♦ డయ్యె, పార్థ ! 17

తే॥ గీ॥ విహితుఁడౌ మిత్రునందును, ♦ నహితునందు,
అట్లె, మానావమాన ద్వ ♦ యంబునందుఁ,
గలితశీతోష్ణ సుఖదుఃఖ ♦ గతులయందు,
సమత వహియించి, సంగవ ♦ ర్జన మొనర్చి,

తే॥ గీ॥ మానియై, స్తుతినిందా స ♦ మానుఁడునయి,
దృఢమతియు, నెంతకంతగఁ ♦ దృప్తుఁడునయి,
* (స్వీయ కాంక్షా స్వరూప) ని ♦ వేశ రహితుఁ
డైన భక్తుండె మత్ప్రియుఁ ♦ డైన నరుఁడు॥ 18,19

తే॥ గీ॥ ధరణి నీధర్మ సహితామృ ♦ తంబు నెవరు
శ్రద్ధధానులు, మఱి మత్ప ♦ రములు నగుచుఁ,
జెప్పినట్టులఁ, బర్యుపా ♦ సించుచుంద్రో,
అట్టి భక్తులు కడుఁబ్రియు ♦ లయ్యె నాకు॥ 20

ఇది శ్రీ లక్ష్మీనరసమాంబా హనుమయార్య పుత్ర,
కవిజన విధేయ, మయిలవర వంశీయ, వేంకట్రామ నామధేయ
ప్రణీతంబైన "భగవద్గీతానువాదము" నందలి
'భక్తి యోగ' మను
పంద్రెండవ యధ్యాయము
సంపూర్ణము

* ఈపాదము తిలక్ మహాశయుని గీతారహస్యము ననుసరించుచున్నది.

శ్రీ

# భగవద్గీతానువాదము

## పదుమూఁడవ యధ్యాయము

### క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగము

అర్జునుఁ డిట్లు ప్రశ్నించెను :

తే॥ గీ॥ * ప్రకృతియన నేమి? పురుషుఁ డ ♦ న్నను? కృష్ణ!
యెద్ది క్షేత్రంబు ? క్షేత్రజ్ఞుఁ ♦ డెవఁడు చెపుము;
జ్ఞాన మెయ్యది? జ్ఞేయం బ ♦ నంగ నెద్ది?
వీనిఁ దెలియంగఁ గోరెద ♦ విశదముగను॥ 1

శ్రీ భగవానుఁ డిట్లు చెప్పెను :

ఆ॥ వె॥ అనఘ! యీ శరీర ♦ మునకు (మీమాంసకుల్)
క్షేత్రమనెడి పేరు ♦ చెప్పుచుంద్రు;
క్షేత్ర మెఱుఁగువాని, ♦ క్షేత్రజ్ఞుఁ డంచుఁ, దత్
శాస్త్రవేత్త లంద్రు, ♦ సవ్యసాచి ! 2

కం॥ క్షేత్రము లఖిలములందున్,
క్షేత్రజ్ఞుఁడుగూడ నేనె; ♦ క్షేత్రనికాయ,
క్షేత్రజ్ఞాతల జ్ఞానమె
ధాత్రిని మత్ జ్ఞానమంచుఁ ♦ దలఁతుఁ, గిరీటీ! 3

---

* ఈ పద్యమునకు సంబంధించినశ్లోకము ప్రక్షిప్తమని చాలమంది అభిప్రాయము. ఆ శ్లోకము శంకరభాష్యములో లేదు.

తే॥ గీ॥ ఎద్ది తత్ క్షేత్ర ? మది యెట్టి ? ♦ దే వికృతులు—
గలది ? యెటనుండి వెడలె ? తత్ ♦ జ్ఞాత యెవఁడు ?
వాని మహిమంబు లెవ్వి ? య ♦ ద్దానినెల్ల
క్షిప్తముగ వచియింతు నా ♦ లింపఁగదవె॥ 4

తే॥ గీ॥ పల్కి రిద్దాని ఋషివరుల్ ♦ బహు విధముల,
వివిధ వేదంబులుం బల్కె ♦ వేఱు పఱచి,
హేతుసహితంబుగా నిశ్చ ♦ యించి పల్కె
"బ్రహ్మసూత్ర" పదంబులుం, ♦ బాండుపుత్త్ర ! 5

తే॥ గీ॥ అల మహాభూతములును, న ♦ హంకృతియును,
ఇఁక, మహత్తును, మూలప్ర ♦ కృతియు, నల్లె-
జ్ఞాన కర్మేంద్రియము లనం ♦ జెనెడి పదియు,
అల్లె మనసును, మఱి, యింద్రి ♦ యార్థ పంచ
కమును, గోర్కియుఁ, బగయు, సౌ ♦ ఖ్యమును, వగపు,
స్థూల దేహేంద్రియాది సం ♦ దోహమదియుఁ,
జేతనంబును, ధృతియు, సం ♦ క్షేపముగను
క్షేత్రమంచు వచింత్రు, వి ♦ కృతులతోఁడ॥ 6, 7

తే॥ గీ॥ నిరభిమానంబు, మఱి, దంభ ♦ నిర్వృతియును,
హింస చేయమియును నోర్పు, ♦ ఋజు గమనము,
స్వీయగురు సేవ, శౌచంబు, ♦ స్థిర మనంబు,
నిత్య సంశోధి తాత్మ వి ♦ నిగ్రహంబు,

తే॥ గీ॥ విషయ భోగానురక్తిని ♦ విడిచియుంట,
కొంచెమేని నహంకృతిఁ ♦ గాంచకుంట,
పుట్టువును, జావుఁ, దెవులును, ♦ ముదిమియు, వగ,
సహజదోషంబు లన్న ని ♦ శ్చయముగనుట,

తే॥ గీ॥ ఆత్మవిష యేతరంబుల ♦ నరతి గనుట,
సుత సతీ గృహాదుల నస ♦ క్తత వహించు,
టప్రియము గల్గ, లేక, ప్రి ♦ యంబు గలుగ,
నిరత సమభావ సంయుక్తి నెగడుచుంట,

తే॥ గీ॥ అఖిలలోకేశునాయం ద ♦ నన్యయోగ-
భావసంయుక్తి నిశ్చల ♦ భక్తిఁగనుట,
ప్రవిమల వివిక్తదేశ ని ♦ వాసియగుట,
దుష్టజన సమూహంబును ♦ దొలఁగియుంట,

తే॥ గీ॥ ఆత్మతత్త్వంబు సర్వదా ♦ అరయుచుంట,
తాత్త్వికజ్ఞాన లాభ సం ♦ దర్శియగుట,—
ఇదియె జ్ఞానం బటంచుఁ జె ♦ ప్పుదురు సుమ్ము;
దీని కెది యన్య, మదియె య ♦ జ్ఞాన, మనఘ! 8, 9,
10, 11, 12

తే॥ గీ॥ ఏది యెఱింగిన నమృతత్వ ♦ మెనయ నగునొ,
యెది యనాది, పరబ్రహ్మ ♦ మెద్ది, యట్టి
జ్ఞేయ మగుదాని నీకు వచిం ♦ చెదను, పార్థ!
అద్ది సదస ద్విలక్షణ ♦ మని వచింత్రు॥ 13

తే॥ గీ॥ దాని కెల్లెడ పాణిపా ♦ దంబులుండు,
అన్ని యెడలను వదనశీ ♦ ర్షాక్షులుండు,
అవిరళంబుగ శ్రోత్రేంద్రి ♦ యంబులుండు,
సృష్టిజగమెల్ల నది యూవ ♦ రించియుండు॥ 14

తే॥ గీ॥ సకల కరణ గుణప్రకా ♦ శంబుగల్గి,
అఖిల కరణ వివర్జిత ♦ మైయెసంగు;
అన్నిటి భరించు, దేనిని ♦ నంటకుండు,
అగుణియును, గుణభోక్తయు ♦ నగును, పార్థ! 15

తే॥ గీ॥ ప్రాణులకు లోను బయట వ్యా ♦ ప్తమయియుండుఁ,
గదలికయె లేకయుండును, ♦ గదలుచుండు,
అమిత సూక్ష్మత్వమున బుద్ధి ♦ క్రందకుండు,
దూరమై యుండు, దగ్గఱ ♦ యై రహించు॥ 16

తే॥ గీ॥ అది యఖండంబెయయ్యు, భూ ♦ తాళియందు
నమరియుండును ఖండంబు ♦ లైన యట్లు;
ప్రాణుల భరించి, మ్రింగి, యు ♦ త్పత్తిచేయు—
నట్టిదదె యంచునెఱుఁగంగ ♦ నగును, పార్థ! 17

తే॥ గీ॥ అది వెలుంగుల వెల్గించు ♦ నట్టితేజ;
మది తమస్సునకంటె వే ♦ ఱని వచింత్రు;
జ్ఞానరూపియు, జ్ఞేయంబు, ♦ జ్ఞానగమ్య,
మది వసించును ప్రాణుల ♦ హృదులయందు॥ 18

తే॥ గీ॥ క్షేత్ర మెద్దియొ, జ్ఞానమ్ము ♦ జ్ఞేయ మెవియొ,
చెప్పినాఁడను నీకు సం ♦ క్షేపముగను;
ఇట్టిజ్ఞానంబు మద్భక్తుఁ ♦ డెఱిఁగియుండి,
అర్హుఁడగుఁజూవె మద్భావ ♦ మందుటకును॥ 19

కం॥ నరవర! ప్రకృతియుఁ బురుషుం
డిరువురును ననాది యంచు ♦ నెఱుఁగంగఁ దగున్;
మఱి, గుణములును, వికారము
లరయంగాఁ బ్రకృతిభవము ♦ లని తెలియనగున్॥ 20

తే॥ గీ॥ తనువు, నింద్రియములుఁ, జేయు ♦ పనులకెల్లఁ
బురుషసంయుత ప్రకృతియే ♦ మూలమంద్రు;
వినుము: సుఖదుఃఖములను సే ♦ వించుటందు,
మోహయుతుఁడైన పురుషుఁడే ♦ మూలమంద్రు॥ 21

తే॥ గీ॥ ప్రకృతియందుండి, పురుషుఁ డా ♦ ప్రకృతివలన
జననమొందు గుణంబుల ♦ ననుభవించుఁ;
బురుషు గుణసక్తియే హేతు ♦ భూత, మాతఁ
డుత్తమ, నికృష్ట, జన్మంబు ♦ లెత్తుటకును॥ 22

తే॥ గీ॥ అనుమతించెడివాఁడంచు, ♦ సాక్షియంచు,
భర్తయును, భోక్తయును, మహే ♦ శ్వరుఁడటంచు,
మఱియుఁ, బరమాత్ముఁ డంచును ♦ బరఁగుచుండు—
పురుషుఁ డుత్కృష్టుఁ డీదేహ ♦ మునఁ, గిరీటి! 23

ఆ॥ వె॥ పురుషుఁ డిట్టివాఁడు, ♦ మఱి, గుణసంయుక్త
మైన ప్రకృతి యిట్టి ♦ దని యెఱుంగఁ
గల్గువాఁడు సర్వ ♦ గతుల వర్తించియు,
మఱల జన్మ మొందు ♦ టెఱుఁగఁ బోఁడు॥ 24

తే॥ గీ॥ ధ్యానయోగంబుఁ బూని కొం ♦ దఱు జగాన,
ఆత్మయం దాత్మఁ గాంచెద ♦ రాత్మ చేతఁ;
గాంత్రు కొందఱు సాంఖ్యయో ♦ గంబుచేతఁ,
గొందఱది కర్మయోగానఁ ♦ గూడఁగాంత్రు॥ 25

తే॥ గీ॥ ఇట్లు గనఁజాల కెవ్వార ♦ లిది యితరుల
వలన విని, న న్నుపాసింపఁ ♦ గలరొ, యట్టి
శ్రవణ తత్పరమతులైన ♦ జనులుగూడ,
మృత్యు సంసార గతిని ద ♦ రింపఁగలరు॥ 26

కం॥ అలఘుగుణ! చరాచరమై
చెలఁగెడి యేసత్త్వమైన ♦ క్షేత్రక్షేత్ర
జ్ఞుల సంయోగంబున నే
కలిగెడిదని మదినెఱుంగఁ ♦ గదవే, పార్థా! 27

తే॥ గీ॥ సర్వభూతంబులందును ♦ సమతమీఱ—
నుండి, యయ్యవి నాశంబు ♦ నొందునపుడు
నాశ మొందనిదో పర ♦ మేశు రూపు
చూడఁగలవాఁడె కలరూపు ♦ చూచువాఁడు॥ 28

తే॥ గీ॥ అఖిల భూత వితానంబు ♦ నందునిండి—
యున్న నీశ్వరు సమునిగాఁ ♦ గన్నవాఁడు
జ్ఞానదూరత నాత్మహం ♦ తకుఁడుగాఁడు;
కాన, నుత్తమప్రాప్య మో ♦ క్షంబు గాంచు॥ 29

తే॥ గీ॥ పురుష సన్నిహితత్వంబుఁ ♦ బొందియుండు
ప్రకృతిచేతనె కర్మముల్ ♦ సకలగతుల
సల్పఁబడునట్లు నరుఁడు గాం ♦ చఁగలయప్పు
డాత్మవస్తు వకర్త యం ♦ చేతఁ దెఱుంగు॥ 30

తే॥ గీ॥ పురుషుఁ డెట్టియవస్థను ♦ బొందినపుడు
భూతభిన్నత్వ మేకస్థ ♦ ముగను దోఁచు,
సృష్టియెల్ల నేకత్వ వి ♦ స్తృతిగఁ దోఁచు,
అట్టిస్థితియందు వాఁడు బ్ర ♦ హ్మమును బొందు॥ 31

తే॥ గీ॥ అవ్యయుండగు నీపర ♦ మాత్మ, యనఘ !
తన యనాదిత్వ, నిర్గుణ ♦ త్వములచేత,
మేననుండియుఁ గర్మముల్ ♦ పూనఁబోఁడు,
ప్రకృతిచేష్టలచేత, లి ♦ ప్తతఁ గనఁడు॥ 32

తే॥ గీ॥ అంతటను వ్యాపకంబగు ♦ నాకసంబు
తనదు సూక్ష్మత, నెట్లలి ♦ ప్తమయియుండు,
అట్లె, సర్వత్ర దేహంబు ♦ లందుఁ గల్గు
నాత్మవస్తు వలిప్తమై ♦ యలరుచుండు॥ 33

తే గీ॥ ఏకసూర్యుండు, కనఁబడిన ♦ లోకమెల్ల,
ఎట్లు వెల్గించుచుండునో, ♦ యట్లె, పార్థ !
తేజరిలఁ జేయుచుండు ను ♦ ద్దీప్తితోడ,
క్షేత్ర సందోహమెల్ల నీ ♦ క్షేత్రియొకఁడె॥ 34

తే॥ గీ॥ నరు లెవరు, జ్ఞానదృష్టి, ని ♦ క్కరణి, క్షేత్ర
మునకు క్షేత్రికిఁ గలభేద ♦ మును గ్రహించి
భూతరూపక ప్రకృతి వి ♦ మోక్ష మరయఁ
గల్గుదురో, వారలు పరమ్మ్ముఁ ♦ గాంచనేర్తు॥ 35

ఇది శ్రీ లక్ష్మీనరసమాంబా హనుమయార్య పుత్త్రి,
కవిజన విధేయ, మయిలవర వంశీయ, వేంకటరామ నామధేయ
ప్రణీతంబైన "భగవద్గీతానువాదము" నందలి
'క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగ' మను
పదుమూఁడవ యధ్యాయము
సంపూర్ణము

---

శ్రీ

# భగవద్గీతానువాదము

## పదునాల్గవ యధ్యాయము

### గుణత్రయవిభాగయోగము

శ్రీ భగవానుఁ డిట్లు చెప్పెను :

తే॥ గీ॥ ఎదియెఱిఁగి మునులెల్ల సం ♦ సృతిని బాసి,
పొందియుండిరో యుత్కృష్ట ♦ మోక్ష పదవి,
జ్ఞానములనెల్ల శ్రేష్ఠమౌ ♦ జ్ఞాన మెదియొ,
అట్టి పరమార్థము వచింతు ♦ నయ్య, మఱల॥ 1

తే॥ గీ॥ ఎలమి నీజ్ఞానమునె యాశ్ర ♦ యింప నేర్చి,
నాదు సాధర్మ్య మొందిన ♦ నరులు, పార్థ !
సృష్టికాలంబునను జన్మ ♦ మెత్తఁ బోరు,
ప్రళయమునందును దుఃఖంబు ♦ పడయఁ బోరు॥ 2

తే॥ గీ॥ * ఓలి మహదాది పరిణామ ♦ మొందు నాదు
ప్రకృతియే సృష్టికెల్ల క్షే ♦ త్రమ్ము సుమ్ము;
దాన, వైతును నాయంశ ♦ మైన బీజ;
మంత, సంభవ మొందు భూ ♦ తాళి యెల్ల॥ 3

---

* 'మహద్బ్రహ్మ' అని మూలము. ఈ పద్యపాదము రామానుజాభిప్రాయము ననుసరించుచున్నది.

ఆ॥ వె॥ ఎల్లయోనులందు, ♦ నేయే స్వరూపంబు
లుద్భవంబు చెందు ♦ చుండు, వాని
కెల్ల మాతయైన ♦ దీ మహత్ ప్రకృతియే;
నేను బీజదాత ♦ నైన పితను॥ 4

తే॥ గీ॥ సత్త్వము, రజస్సు, తమ మనం ♦ జెను గుణంబు
లుద్భవము చెందుఁ బ్రకృతియం ♦ దుండి, పార్థ !
ఆగుణంబులె యవ్యయుఁ ♦ డై రహించు
దేహిని శరీరమందు బం ♦ ధించుచుండు॥ 5

తే॥ గీ॥ వానిలో, నిర్మలత్వంబుఁ ♦ బడసియుంట,
సత్త్వము, ప్రకాశకంబు, దో ♦ ష రహితంబు—
నగుచు జీవుని బంధించు ♦ నయ్య, పార్థ !
సౌఖ్యసంగంబునను, జ్ఞాన ♦ సంగమునను॥ 6

తే॥ గీ॥ రజము రాగాత్మకంబగు ♦ ప్రబలియుండుఁ,
దృష్ణకును, సంగమునకును, ♦ హేతు వగుచు;
దేహినిది దేహమందుఁ, గుం ♦ తీకుమార !
కట్టివైచును గర్మసం ♦ గంబుచేత॥ 7

తే॥ గీ॥ తమమొ, యజ్ఞాన సంజని ♦ తమ్ము. సూవె;
యెల్లజీవుల నది విమో ♦ హితులఁ జేయు;
అది ప్రమాదంబు, మాంద్యంబు, ♦ నిదుర యనెడి
వానిచే జీవునిం గట్టి ♦ వైచుచుండు॥ 8

తే॥ గీ॥ సత్త్వమది జీవునింగూర్చు ♦ సౌఖ్యమంను,
రజ మతని గూర్చుచుండుఁ గ ♦ ర్మంబునందు;
అక్కట ! తమస్సు జ్ఞానంబు ♦ నావరించి
తారుకొల్పు దేహిని బ్రమా ♦ దంబునందు॥ 9

తే॥ గీ॥ రజము, తమ, మను రెంటిఁ ది ♦ రస్కరించి
సత్త్వము విజృంభణము గాంచు, ♦ సవ్యసాచి !
తమము జృంభించు, రజము, స ♦ త్త్వమ్ము నడంచి,
సత్త్వ, తమము లడంచి ర ♦ జంబు మించు॥ 10

తే॥ గీ॥ ఈ శరీరంబు నందలి ♦ యింద్రియంబు
లనెడి ద్వారంబు లఖిలంబు ♦ లందు నెపుడు
జ్ఞాన రూపకమౌ ప్రకా ♦ శంబు పుట్టు,
అపుడె సత్త్వమ్ము హెచ్చెయు ♦ నంచుఁ గనుము॥ 11

తే॥ గీ॥ రజము హెచ్చెడు వేళనో, ♦ ప్రవిమలాత్మ !
ద్రవ్య లోభంబు, వ్యర్థక ♦ ర్మ ప్రవృత్తి,
కర్మసంగం, బతృప్తియుఁ, ♦ గడిఁది యాస,
యనెడి లక్షణములు గాంచ ♦ నగును జూవె॥ 12

ఆ॥ వె॥ జ్ఞానహీనతయును, ♦ స్తబ్ధత్వ మొనయుట,
మఱపు చెందియుంట, ♦ మౌఢ్య వృత్తి,
యనెడి లక్షణములు ♦ గనిపించుచుండును
దమము హెచ్చుచుండు ♦ తఱిని, పార్థ ! 13

తే॥ గీ॥ సత్త్వము ప్రవృద్ధమైయుండు ♦ సమయమందు,
దేహి, దేహంబు విడుట ప్రా ♦ ప్తించెనేని,
* అలఘు మహాదాది తత్త్వవే ♦ త్తలు గడించు
పుణ్య లోక నివాసంబుఁ ♦ బొందు నతఁడు॥ 14

తే॥ గీ॥ రజము ప్రబలత గనువేళఁ ♦ బ్రళయ మొదవఁ,
కర్మసక్తులలోఁ బుట్టు ♦ గాంచుచుండు;
అట్లె, తమ మెచ్చుతఱిని దే ♦ హంబు వీడ,
నీచయోనుల యందు జ ♦ న్మించుచుండు॥ 15

తే॥ గీ॥ సాత్త్వికంబగు కర్మకు ♦ సత్త్వజనిత
మైన నైర్మల్యమే ఫల ♦ మని వచింత్రు;
వగయె రాజస కర్మకు ♦ ఫలము సుమ్ము;
మోహమే తామసపుఁగర్మ ♦ మ్మునకు ఫలము॥ 16

తే॥ గీ॥ జ్ఞాన మొదవును సత్త్వ గు ♦ ణంబువలన;
రజమువలనను, లోభంబు ♦ ప్రభవ మొందుఁ;
దామస గుణంబునను, బ్రమా ♦ దంబు, భ్రమయు,
నింక, నజ్ఞానమును జని ♦ యించుచుండు॥ 17

తే॥ గీ॥ ఊర్ధ్వమున కేగుదురు సత్త్వ ♦ యుక్తమతులు;
రాజసులు నిల్చుచుంద్రు మ ♦ ధ్యంబునందు;
ఇఁక, నధోగతి గాంత్రు, ని ♦ కృష్ట వృత్తి
సంచరించెడి తామస ♦ జనము, లనఘ ! 18

* ఈ పాదము శంకరాభిప్రాయము ననుసరించుచున్నది.

తే॥ గీ॥ ద్రష్ట, యేస్థితిలో, గుణ ♦ త్రయముకంటె
నితర మగు దానిఁ గర్తగా ♦ నెంచఁబోఁడొ,
యెపుడు గుణభిన్న పరతత్త్వ ♦ మెఱుఁగఁ గలఁడొ,
అప్పు డాతండు మద్భావ ♦ మందఁ గలఁడు॥ 19

తే॥ గీ॥ తనుసముద్భవ హేతుభూ ♦ తమగునట్టి
యీ గుణత్రయమును దరి ♦ యింపఁగలిగి,
జన్మ మృత్యు జరా దుఃఖ ♦ సమితి నుండి
విడువఁబడి దేహి, యమృతంబు ♦ పడయ నేర్చు॥ 20

అర్జునుఁ డిట్లు ప్రశ్నించెను :

తే॥ గీ॥ దేవ ! యీ త్రిగుణంబు ల ♦ తిక్రమించు
ధన్యుఁ డే లక్షణములతోఁ ♦ దనరుచుండు ?
అతని వర్తన మెట్టిది ? ♦ అతఁ డెట్లు
దాఁటఁగా నేర్చు నీగుణ ♦ త్రయము, చెపుమ॥ 21

శ్రీ భగవానుఁ డిట్లు చెప్పెను :

తే॥ గీ॥ సత్త్వగుణ కార్యమా ♦ ప్రకాశంబు, రాజ
స ప్రవృత్తియు, మఱి, తమో ♦ జనిత మోహ,
మిట్టి వెవియైనఁ బ్రాప్తింప, ♦ నేవగింపఁ;
డవి తొలంగినఁ, గాంక్షసే ♦ యం డతండు॥ 22

తే॥ గీ॥ స్థిరత వహియించు నెవఁ డుదా ♦ సీను పగిది,
నెవఁడు గుణవికృతులచే వి ♦ కృతిఁ గనండొ,
త్రిగుణములె కర్మలందు వ ♦ ర్తింతు రంచుఁ
బటు వినిశ్చయమునఁ జలిం ♦ పం డెవండు,

తే॥ గీ॥ సౌఖ్య దుఃఖ ద్వయంబందు, ♦ స్వర్ణ లోష్ట
శిలలయం, దప్రియ ప్రియ ♦ కలన యందు,
ఆత్మ సంస్తుతి నిందల ♦ యం, దెవండు,
సమత వహియించి, ధీరుఁడై, ♦ స్వాస్థ్య మెనసి,

తే॥ గీ॥ మాన మవమాన మన్న, స ♦ మానుఁడగుచు,
శత్రు మిత్ర పక్షంబుల ♦ సమతఁగనుచు,
అఖిలకర్మ ఫలత్యాగి ♦ యగునో, యతఁడు
తెలియఁ బడుచుండుఁజుమి, గుణా ♦ తీతుఁ డనఁగ॥
23, 24, 25

తే॥ గీ॥ అవని నెవ్వఁడై కాంతిక ♦ మైన భక్తి—
యోగమున నన్ను సేవించు ♦ చుండు,నతఁడు
త్రిగుణముల, నశేషముగ, న ♦ తిక్రమించి,
బ్రహ్మభావంబు పడయ న ♦ ర్హతను గాంచు॥ 26

తే॥ గీ॥ అమృత, మవ్యయ, మైనబ్ర ♦ హ్మంబునకును,
మహిత శాశ్వతరూప ధ ♦ ర్మంబునకును,
నిశ్చ లానందమునకును, ♦ నేనె నూవె
ఆశ్రయ స్థానమై యల ♦ రారు వాఁడ॥ 27

ఇది శ్రీ లక్ష్మీనరసమాంబా హనుమయార్య పుత్ర,
కవిజన విధేయ, మయిలవర వంశీయ, వేంకటరామ నామధేయ
ప్రణీతంబైన "భగవద్గీతానువాదము" నందలి
'గుణత్రయ విభాగ యోగ' మను
పదునాల్గవ యధ్యాయము
సంపూర్ణము

శ్రీ

# భగవద్గీతానువాదము

## పదునైదవ యధ్యాయము

### పురుషోత్తమప్రాప్తియోగము

శ్రీ భగవానుఁ డిట్లు చెప్పెను :

తే॥ గీ॥ ఊర్ధ్వమున వేళ్ళు, శాఖల ♦ యునికి క్రిందఁ,
గలుగు నశ్వత్థ మవినాశి ♦ గా వచింత్రు;
నిగమములు దాని పర్ణంబు ♦ లగుట, నట్టి
తరువు నెఱిఁగిన దెవఁడో, వే ♦ దవిదుఁ డతఁడె॥ 1

తే॥ గీ॥ దీని శాఖలు గ్రమ్మఁ గ్రిం ♦ దికినిఁ బైకిఁ,
ద్రిగుణములు పెంప, విషయాళి ♦ చిగురుగాఁగఁ;
గర్మవశగాములై, నృలో ♦ కమున, దీని
వేళ్ళు క్రిందికి సైతము ♦ విస్తరించె॥ 2

తే॥ గీ॥ దీని యాద్యంత సంస్థితుల్, ♦ దీని రూప,
మిట్లు తెలియంగ నలవిగా ♦ దిహము నందుఁ;
బాదుకొన్న యీ యశ్వత్థ ♦ పాదపమును
బ్రబలమైన యసంగ శ ♦ స్త్రమున నఱికి,

తే॥ గీ॥ * దాన, వెదుకంగఁజెల్లు, నె ♦ ద్దానిఁ గన్నఁ,
దిరిగి పుట్టుట లేదో, యా ♦ స్థిర పదంబు,
ఎవనినుండి యనాదిప్ర ♦ వృత్తి ప్రగమ్మె,
అప్పురుషుఁ డాద్యుఁడే శర ♦ ణంబు నెంచి॥ 3, 4

తే॥ గీ॥ మానమోహంబు లెడలి, సం ♦ సర్గ మడఁచి,
ఆత్మతత్త్వాభిరతి గాంచి ♦ యాస లుడిగి,
విగత సుఖదుఃఖ సంజ్ఞక ♦ ద్వితయు లగుచుఁ,
బ్రాజ్ఞు లవ్యయమైన త ♦ త్పదముఁ గాంత్రు॥ 5

తే॥ గీ॥ దాని, రవి గాని, కుముద బాం ♦ ధవుఁడు గాని,
కీలి గాని, వెలింగింపఁ ♦ జాల రెవరు;
దేనిఁగని జీవు లిఁకనిటు ♦ తిరిగి రారొ,
అట్టి యుత్తము పదము నా ♦ యది, కిరీటి! 6

తే॥ గీ॥ మత్పురాణాంశమే యీ స ♦ మస్తమైన
ప్రాణి చయమునందు జీవ రూ ♦ పంబు నొంది,
ప్రకృతిగములై, మన స్సాఱు ♦ వదిగఁ గల్గు
నింద్రియంబులఁ దనకడ ♦ కీడ్చుకొనును॥ 7

తే॥ గీ॥ విభుఁడు దేహంబునం జొచ్చు ♦ వేళ, దాని
విడిచి చను వేళ, వీనిని ♦ స్వీకరించి,
అరుగుదెంచును, గంధాశ ♦ యములనుండి
వాసనలఁగొని యరుదెంచు ♦ వాయు వట్లు॥ 8

* పిదప, వెదుకంగఁజెల్లు, నె ♦ య్యది లభింపఁ,

తే॥ గీ॥ శ్రవణకరణంబు, చక్షువుల్, ♦ స్పర్శనమును,
నాల్కయును, నాసికయును, మ ♦ నస్సు, ననెడి
ఆఱిటి నిజాశ్రయంబుగ ♦ నమరిచికొని,
అనుభవించును విషయంబు ♦ లను, విభుండు॥ 9

ఆ॥ వె॥ దేహి మేను విడుట, ♦ దేహమం దుంటయు,
గుణ చయంబు తోడఁ ♦ గూడి, విషయ
భోక్త యౌటయును, వి ♦ మూఢుండు గనలేఁడు,
కాంచు జ్ఞానదృష్టి ♦ గలుగు వాఁడు॥ 10

తే॥ గీ॥ యత్న యుతులైన యోగి జ ♦ నాళి గూడ,
వీనిఁ గాంతురు, లోనున్న ♦ వానిగాను;
అకృత మతు లన్ననో, కృత ♦ యత్ను లయ్యు,
అజ్ఞతను, జూడఁజాలరీ ♦ యాత్మ, ననఘ! 11

ఆ॥ వె॥ భాస్కరస్థమై ప్ర ♦ భా పుంజ మెయ్యది
యెల్లజగతిఁ దేజ ♦ రిల్లఁ జేయు,
ఎద్ది వెలయు శర్వ ♦ రీశునం, దగ్నియం,
దా వెలుంగు నాదె ♦ యంచుఁ గనుము॥ 12

తే॥ గీ॥ భూమిలోఁ జొచ్చి, నా బల ♦ స్ఫూర్తి చేత,
నిఖిల భూత వితానంబు ♦ నిలుపుచుందు;
రస భరాత్మకుఁడైన చం ♦ ద్రముఁడ నగుచు,
ఓషధులనెల్ల బోషించు ♦ చుందుఁ, బార్థ! 13

తే॥ గీ॥ నేనె వైశ్వానరుండనై, ♦ ప్రాణి తతుల
మేనులం జొచ్చి, ప్రాణం బ ♦ పాన మనెడి
వాయువులఁ గూడి, జీర్ణంబు ♦ సేయుచుందు
నలు తెఱంగుల యాహార ♦ ములను, పార్థ! 14

తే॥ గీ॥ ఏ నఖిలభూత సంఘాత ♦ హృత్స్థితుండ;
నావలనఁ బుట్టు, స్మృతియు, జ్ఞా ♦ నమును, మఱపు;
అఖిల వేదంబులన్, వేద్యుఁ ♦ డైన దేనె;
నేనె వేదాంతకర్తను, ♦ నిగమ విదుఁడ॥ 15

తే॥ గీ॥ జగతిలోపల, క్షరుఁడు, న ♦ క్షరుఁ డటంచుఁ,
బురుషు లిరువురు గలరోయి, ♦ పురుషవర్య!
అందు, క్షరుఁడన, సర్వ దే ♦ హా స్వరూపి;
అక్షరుండనఁ, గూటస్థుఁ ♦ డండ్రు బుధులు॥ 16

తే॥ గీ॥ ఉత్తముఁడు, వీరికంటె న ♦ న్యుం డెవండో,
అట్టి పురుషుని బరమాత్ముఁ ♦ డని వచింత్రు;
త్రిజగములయందుఁ జొచ్చి భ ♦ రించుచుండు
అవ్యయుండగు నీశ్వరుం ♦ డతఁడె, పార్థ! 17

కం॥ క్షరు మించు హేతువున, న
క్షరుఁ గూడ నతిక్రమించు ♦ కతమున, నే నీ
ధరలోను, వేదమందును,
బురుషోత్తముఁ డన్న నామ ♦ మునఁ బ్రథితుండన్॥ 18

తే॥ గీ॥ ఎవ్వఁ డజ్ఞాన రహితుఁడై ♦ యిట్లు నన్ను
నెఱుఁగఁ గననేర్చుఁ బురుషోత్త ♦ ముఁడ నటంచు,
సర్వవిదుఁడైన యా నర ♦ సత్తముండు
భజనసేయును నను సర్వ ♦ భావమునను॥ 19

తే॥ గీ॥ ఇట్లు గూఢతమంబై ర ♦ హించునట్టి
శాస్త్ర మిద్దాని, నే బోధ ♦ సల్పినాఁడ;
దీని బాగుగ నెఱిఁగిన ♦ మానవుండు
ధీయుతుండుఁ, గృతార్థుఁడు ♦ నై యెసంగు॥ 20

ఇది శ్రీ లక్ష్మీనరసమాంబా హనుమయార్య పుత్త్రి,
కవిజన విధేయ, మయిలవర వంశీయ, వేంకటరామ నామధేయ
ప్రణీతంబైన "భగవద్గీతానువాదము" నందలి
'పురుషోత్తమప్రాప్తి యోగ' మను
పదునైదవ యధ్యాయము
సంపూర్ణము

---

శ్రీ

# భగవద్గీతానువాదము

## పదునాఱవ యధ్యాయము

### దైవాసురసంపద్విభాగయోగము

శ్రీ భగవానుఁ డిట్లు చెప్పెను :

తే॥ గీ॥ శాస్త్రవిహితాభయంబును, ♦ సత్త్వశుద్ధి,
జ్ఞాన యోగ వ్యవస్థలఁ ♦ గాంచియుంట,
దానమును, నిగ్రహము, యజ్ఞ ♦ తత్పరతయు,
ఆగమాధ్యయనము, తపం, ♦ బార్జవంబు,

తే॥ గీ॥ ప్రాణ్యహింసయు, నిజము, కో ♦ పంబులేమి,
త్యాగము, శమమ్ము, నపిశున ♦ త్వంబు, భూత—
తతులయెడ దయయును, నలో ♦ లతయు, మార్ద
వంబు, లజ్జయుఁ, జంచల ♦ త్వంబులేమి,

తే॥ గీ॥ ప్రతిభయును, నోర్పు, శౌచంబు, ♦ ధృతియు, ద్రోహ
రహిత చిత్తంబు, మఱియు, గ ♦ ర్వంబులేమి,—
ఈ గుణంబులు దైవస ♦ మృద్ధి యందుఁ
బుట్టు మనుజునియందుఁ గ ♦ న్పట్టుచుండు॥ 1, 2, 3

తే॥ గీ॥ దంభమును, స్వాభిమానంబు, ♦ దర్పయుక్తి,
పరుషతయుఁ, గ్రోధ, మజ్ఞాన ♦ పరవశత్వ,
మనెడి గుణములు గాంచనౌ ♦ నాసురంపు
సంపదకు జన్మమెత్తెడి ♦ జనునియందు॥ 4

తే॥ గీ॥ దైవసంపద మోక్షప ♦ దమ్ముఁ జేర్చు;
ఆసుర సమృద్ధి బంధంబు ♦ నందుఁ గూర్చు;
ఈవొ పుట్టితి దైవ స ♦ మృద్ధితోడ;
అందుచేతను, శోకంబుఁ ♦ బొందవలదు॥ 5

తే॥ గీ॥ వినుము : దైవాసురసమృద్ధు ♦ లనఁగ, భూత
సృష్టి లీ లోకమునయందు ♦ రెండు తెగలు;
రెంట, దైవాంశమది విస్త ♦ రించినాఁడ;
ఇంక, నసురాంశమును గూర్చి ♦ యెఱుక పఱతు॥ 6

తే॥ గీ॥ ఆసురాంశ ప్రభూతులై ♦ నట్టి జనము
లెఱుఁగరు ప్రవృత్తియేని, ని ♦ వృత్తియేని;
శౌచము నెఱుంగ, రెఱుఁగ రా ♦ చారమేని;
మఱి, యథార్థం బదెద్దియో ♦ యెఱుఁగఁబోరు॥ 7

తే॥ గీ॥ జగమది, యసత్య, మప్రతి ♦ ష్ఠం, బనీశ్వ
రంబనియుఁ, గామహేతుకా ♦ ర్యంబె యనియు,
ఇఁకఁ, బరస్పర కామహే ♦ తుకము గాక
పొలుచున్నది యెద్దియనియుఁ, జె ♦ ప్పెదురు వారు॥ 8

తే॥ గీ॥ ఇట్టి విపరీతమైనట్టి ♦ దృష్టిఁ బూని,
అల్పబుద్ధులు, మఱి, విన ♦ ష్టాత్ములునయి,
క్రూరకర్మల, లోక వి ♦ రోధులునయి,
పుట్టుచుందురు వీరలు ♦ పుడమి చెఱుప॥ 9

తే॥ గీ॥ తనివి దీరని కోరికం ♦ దగులు చెంది,
దంభ మాన మదంబు లెం ♦ తయును గల్గి,
మోహమున, నసత్ సాధనం ♦ బుల గ్రహించి,
నీచ నిష్ఠల మెలఁగుచుం ♦ డెదరు వీరు॥ 10

తే॥ గీ॥ చావుకాలంబు వఱకును ♦ జావనట్టి
అపరిమితమైన చింతల ♦ నాశ్రయించి,
కామభోగంబె యుత్కృష్ట ♦ గతిగ నెంచి,
యిదియె పరమావధి యటంచు ♦ నెదఁ దలంచి,

తే॥ గీ॥ పలువిధాలగు నాసలన్ ♦ వలలఁ జిక్కి,
కామమున్ గ్రోధ మను రెంటి ♦ కడను జేరి
విషయ భోగార్థ మన్యాయ ♦ వృత్తి నూని,
అర్థసంచయమును గూర్ప ♦ నాస గొంద్రు॥ 11, 12

తే॥ గీ॥ "నేఁడు నేనింత గడియించి ♦ నాఁడ సహహా!
యీ మనోరథ మింక నీ ♦ డేఱఁ గలదు;
ఇపుడు నాచేతిలోఁ గల ♦ దింత ద్రవ్య;
మింకపైఁ గూర్పనేర్తు నిం ♦ తింత మఱల;

తే॥ గీ॥ శత్రుఁడగు వీని, నోర! నేఁ ♦ జంపినాఁడ;
ఇతర శత్రులనేఁ వధి ♦ యింతు నింక;
నేనె యీశ్వరుఁడనుజుమీ; ♦ నేనె భోగి;
నేనె సిద్ధుండ, బలశాలి; ♦ నేనె సుఖిని॥

తే॥ గీ॥ గొప్ప ధనవంతుఁడను; గొప్ప ♦ కులమువాఁడ;
వసుధ నాకు సమానుఁడౌ ♦ వాఁ డెవండు?
యజ్ఞము లొనర్తు, ధనమిత్తు, ♦ నలర నేర్తు;"—
అంచు నజ్ఞాన మోహితు ♦ లైన వీరు,

తే॥ గీ॥ బహు విధాలగు చిత్తవి ♦ భ్రాంతిఁ జెంది,
అలఘు మోహ జాలమ్ము త ♦ మ్మావరింపఁ,
కామ భోగానురక్తులై, ♦ కశ్మలంపు
నరక కూపంబులోఁ గూలె ♦ దరు, కిరీటి! 13, 14, 15, 16

తే॥ గీ॥ ఆత్మసంభావితులును, స్వ ♦ యంభువులును,
మాన, ధన, మదోపేతులు ♦ నైనవీరు
నామమాత్ర యజ్ఞంబు లొ ♦ నర్చుచుంద్రు
దంభమునకయి, విధి విరు ♦ ద్ధంపు గతుల॥ 17

తే॥ గీ॥ వా రహంకృతి, బలము, గ ♦ ర్వ ప్రవృత్తి,
అల్లె, కామంబు, క్రోధంబు ♦ నాశ్రయించి
స్వ పర దేహ గతుండనై ♦ పరఁగు నాదు
* ఉనికియే యేవగింత్రు కు ♦ యుక్తు లరసి॥ 18

---

* ఈపాదము రామానుజాభిప్రాయము ననుసరించుచున్నది.

తే॥ గీ॥ కోరి నన్నవగించెడి ♦ క్రూర మతులు,
నశుభ కర్ములు, నగు నాన ♦ రాధములను
సంతతము వైచుచుందు సం ♦ సారమందు,
అందు, రాక్షసయోనుల ♦ యందుఁ, బార్థ ! 19

తే॥ గీ॥ ఆసురంబగు యోనుల ♦ యందుఁ జొచ్చి
జ్ఞానశూన్యులు, జన్మ జ ♦ న్మమున, నన్నుఁ
బొందలేకయె, కాంచెంగఁ ♦ బోదు, రనఘ !
అంతకంటెను నధమమౌ ♦ నట్టిగతిని॥ 20

తే॥ గీ॥ లోకమందుఁ గామ క్రోధ ♦ లోభము లనఁ
బరఁగు మూఁడును ద్వారముల్ ♦ నరకమునకు;
అవియె పురుష వినాశహే ♦ తువులు; గాన
వాని మూఁడింటి విడువంగ ♦ వలయు నరుఁడు॥ 21

తే॥ గీ॥ పార్థ ! యీ తమోరూపక ♦ ద్వారములను
మూఁటిని ద్యజింపఁ గల్గిన ♦ పురుషుఁ డెవఁడో,
ఆతఁ డాత్మకు మేల్గూర్చు ♦ నది యొనర్చి
దాన, నుత్తమ మోక్ష ప ♦ దమ్ము గాంచు॥ 22

తే॥ గీ॥ శాస్త్రవిధి వీడి, యిష్టాను ♦ సారముగను
సంచరించుచునుండెడి ♦ జనుఁ డెవండో,
వాఁడు పురుషార్థ సిద్ధియేఁ ♦ బడయఁబోఁడు,
పొందఁడు సుఖమ్ము, పైగతి ♦ మొదలె గనఁడు॥ 23

తే॥ గీ॥ కనుకఁ, 'గార్యంబును, నకార్య' ♦ మనెడి నిర్ణ
యమ్ముసేయ శాస్త్రమె ప్రమా ♦ ణమ్ము నీకుఁ;
గాన, శాస్త్ర విధానోక్త ♦ కర్మ మెఱిఁగి
దాని సలుపంగ నీకిటఁ ♦ దగును, పార్థ ! 24

ఇది శ్రీ లక్ష్మీనరసమాంబా హనుమయార్య పుత్త్రి,
కవిజన విధేయ, మయిలవర వంశీయ, వేంకటరామ నామధేయ
ప్రణీతంబైన "భగవద్గీతానువాదము" నందలి
'దైవాసుర సంప ద్విభాగ యోగ' మను
పదునాఱవ యధ్యాయము
సంపూర్ణము

శ్రీ

# భగవద్గీతానువాదము

## పదునేడవ యధ్యాయము

### శ్రద్ధాత్రయవిభాగయోగము

అర్జునుఁ డిట్లు ప్రశ్నించెను :

తే॥ గీ॥ శాస్త్ర నియమంబులను వీడి, ♦ శ్రద్ధ గల్గి
పూజల నొనర్చుచుండెడి ♦ పురుషు లెవరో,
అట్టివారలనిష్ఠ య ♦ దెట్టి ? దనఘ !
సాత్త్వికమొ, రాజసమొ, తామ ♦ సంబొ, చెపుమ॥ 1

శ్రీ భగవానుఁ డిట్లు చెప్పెను :

తే॥ గీ॥ ప్రాణులకుఁ దమతమ స్వభా ♦ వమును బట్టి
సాత్త్వికము, రాజసము, తామ ♦ సంబనంగ
శ్రద్ధయును మూఁడు విధములై ♦ ప్రభవ మొందు;
అది వచించెద నాలింపఁ ♦ గదవె యింక॥ 2

తే॥ గీ॥ శ్రద్ధ యనునది యెల్లవా ♦ రలకు వారి
వారి సత్త్వాన కనురూప ♦ మై రహించుఁ;
దలఁప నీపురుషుండు శ్ర ♦ ద్ధాఫలంబె;
యెవనిశ్రద్ధ యెట్టిదో, యట్టిఁ ♦ డే యతండు॥ 3

తే॥ గీ॥ దేవతలఁ గొల్చుచుంద్రు సా ♦ త్త్విక జనంబు;
రాజసులు భజింతురు యక్ష ♦ రాక్షసులను;
ఇంకఁ, దామసతతి భజి ♦ యించుచుండు
భూతగణముల, నట్లె, ♦ ప్రేతతతుల॥ 4

తే॥ గీ॥ కర మహంకార, దంభ సం ♦ గతిని గాంచి,
కామ, రాగ, బల, త్రయ ♦ కలితులగుచు,
శాస్త్ర నిర్ణీత నియమముల్ ♦ సరకుగొనక,
ఉగ్ర తపముల నొనరించు ♦ చుందురెవరు,

తే॥ గీ॥ జను లెవరు శరీరస్థ భూ ♦ త నివహమును,
అల్లె, యంతశ్శరీరస్థ ♦ సాక్షినైన
నన్నును, గృశింపఁజేయుచు ♦ న్నారొ, యట్టి
అజ్ఞు లాసుర నిశ్చయు ♦ లంచుఁ గనుము॥ 5, 6

తే॥ గీ॥ ప్రాణులకు నెల్ల నాహార ♦ మనునదియును
ప్రియముఁ గూర్చెడిదై యుండుఁ ♦ ద్రివిధముగను;
యజ్ఞముఁ, దపంబు, దానంబు, ♦ నట్లె సుమ్ము;
వీని యీ విభేదమును దె ♦ ల్పెదను వినుము॥ 7

తే॥ గీ॥ ఆయు, రారోగ్య, బల, సౌఖ్య, ♦ హర్ష, సత్త్వ
ములను బెంచెడివై, రసం ♦ బులును, జేమురు
గలిగి, స్థిరతను, రమ్యత, ♦ నలరు భోజ_
నములు సాత్త్విక జనుల కి ♦ ష్టములు, పార్థ ! 8

తే॥ గీ॥ కడిఁది కారమ్ము, పు, ల్లుప్పు, ♦ ఘాటు, వేడి,
గలిగి, రూక్షంబులు, విదాహ ♦ కరములునయి,
తెవులు, కష్టంబు, శోకంబు ♦ దెచ్చు భోజ_
నములు రాజస ప్రియజన ♦ కములు సుమ్ము॥ 9

తే॥ గీ॥ జాము చల్లారినదియును, ♦ జెప్పినదియుఁ,
బాఁడువాసన గలదియుఁ, ♦ బర్యుషితము,
ఎంగిలియు, మఖానర్హంబు ♦ నెదియొ, యట్టి
తిండియే తామసులకుఁ బ్రీ ♦ తినిడు తిండి॥ 10

తే॥ గీ॥ శాస్త్రచోదితమైన య ♦ జ్ఞంబు, చేయఁ
దగినదే యంచు, మదిసమా ♦ ధానమంది,
ఫలము గోరని వారలు ♦ సలుపునెడల,
అట్టి యజ్ఞంబు సాత్త్విక ♦ యజ్ఞ మండ్రు॥ 11

తే॥ గీ॥ ఫలమునొందలి కోరిక ♦ వలనఁగాని,
మఱి, ప్రతిష్ఠ గడించుట ♦ కొఱకుఁగాని,
ఆచరింపంగఁబడునట్టి ♦ యజ్ఞ మెదియొ,
అద్ది రాజసమౌ యజ్ఞ ♦ మని వచింత్రు॥ 12

తే॥ గీ॥ అనఘ! విధిహీనమై, యసృ ♦ ష్టాన్నమునయి,
మంత్రములమాట, దక్షిణ ♦ మాట లేక,
శ్రద్ధయన్నదియును లేక ♦ సల్పఁబడెడి
యజ్ఞమయ్యది తామస ♦ యజ్ఞ మండ్రు॥ 13

తే॥ గీ॥ దేవ, గురుజన, పండిత, ♦ ద్విజవితతికి
అర్చన యొనర్చుటయు, శౌచ, ♦ మార్జవంబు,
బ్రహ్మచర్య, మహింసయుం ♦ బరఁగుచుండుఁ
దనువుసంబంధమైనట్టి ♦ తప మనంగ॥ 14

తే॥ గీ॥ ప్రియము, హితమును, సత్యంబు ♦ నయి, యొరులకు
బాధగూర్పని వాక్యంబుఁ ♦ బల్కుచుంట,
నిగమ వాఙ్మాల పఠనముఁ ♦ జేయుచుంట,
వాచికంబగు తపమంచుఁ ♦ బల్కుచుంద్రు॥ 15

తే॥ గీ॥ మానస ప్రసాదంబు, సౌ ♦ మ్య స్వభావ,
మాత్మ నిగ్రహమును, మౌన, ♦ మాత్మశుద్ధి,
అనెడి మానస వృత్తు ల ♦ య్యవి, గుణాఢ్య !
మానస తపం బటన్న నా ♦ మమునఁ బరఁగు॥ 16

తే॥ గీ॥ అనఘ! యీమూఁడు విధములై ♦ నట్టితపము,
నుత్తమంబగు శ్రద్ధతో, ♦ యుక్తమతిని,
నరులు ఫలకాంక్ష లేక యొ ♦ నర్తురేని,
అద్ది సాత్త్విక తపమంచుఁ ♦ బెద్ద లంద్రు॥ 17

తే॥ గీ॥ జనుల సత్కార మాన పూ ♦ జలను బడయఁ,
బ్రకటన ప్రధానముగ స ♦ ల్పంగఁబడెడి
తపము రాజస మనియును, ♦ దాని ఫలము
చలము, నధ్రువ మనియును, ♦ బలుకుచుంద్రు॥ 18

తే॥ గీ॥ తనను దేహంబు పీడించు ♦ కొనుచుఁగాని
యితరులకు నాశమొంచిన ♦ కతనఁగాని,
మూర్ఖపుం బట్టుదలను స ♦ ల్పు తప మెదియొ,
అద్ది తామసమౌ తప ♦ మని వచింత్రు॥ 19

తే॥ గీ॥ ఈయఁదగునన్న మానస ♦ వృత్తితోడఁ
దనకుఁ బ్రత్యుపకారంబు ♦ దలఁపఁబోక,
తగినవౌ దేశ కాల పా ♦ త్రంబు లరసి
సల్పఁబడునట్టి దానంబు ♦ సాత్త్వికంబు॥ 20

తే॥ గీ॥ ఎద్ది ప్రత్యుపకారంబు ♦ నెంచిగాని,
కాక, వేఱొక్క ఫలకాంక్ష ♦ గల్గిగాని,
ఉల్లమున నొచ్చుకొనిగాని, ♦ యొసఁగఁబడునో,
అట్టిదానంబు రాజస ♦ మని వచింత్రు॥ 21

తే॥ గీ॥ తగని స్థలమందుఁ, దగనట్టి ♦ తఱి, నపాత్రు
లైనవారికి నొసఁగెడి ♦ దాన మెదియొ,
దానమెది యసత్కృత, మవ ♦ మానయుతమొ,
అట్టిదానంబు తామస ♦ మని వచింత్రు॥ 22

తే॥ గీ॥ సరవి ‘ఓ’ మంచు, ‘తత్త’ంచు, ♦ ‘సత్త’టంచు
బ్రహ్మనామంబు త్రివిధమై ♦ ప్రకటమయ్యె;
బ్రహ్మనామంబునందుండి ♦ బ్రాహ్మణులును,
వేదములు, యజ్ఞములుఁ బ్రభ ♦ వించెఁ దొల్లి॥ 23

తే॥ గీ॥ కాన, శాస్త్రచోదిత యజ్ఞ ♦ దాన తపము
లనెడి క్రియలకుఁ బ్రారంభ ♦ మందు సతము
‘ఓ’ మనెడి బ్రహ్మనామంబు ♦ నుచ్చరించి
వాని నొనరింతు రలబ్రహ్మ ♦ వాదు; లనఘ! 24

తే॥ గీ॥ అట్లె, మోక్ష మపేక్షించు ♦ నట్టి వారు
'తత్త'నెడి దుచ్చరించుచుఁ ♦ దా రొనర్తురు
యజ్ఞము, తపంబు, దానం బ ♦ టన్న వివిధ
కర్మజాలంబు, తత్ఫల ♦ కాంక్ష లేక॥ 25

తే॥ గీ॥ 'సత్తు' 'కల'దన్న దానికి ♦ సంజ్ఞ సుమ్ము;
పరఁగు నద్దియె 'మంచి'దన్ ♦ భావమందు;
అట్టులె, ప్రశస్తమైన క ♦ ర్మాళియందు
'సత్' పదంబు ప్రయోగింత్రు, ♦ సవ్యసాచి! 26

తే॥ గీ॥ యజ్ఞ, దాన, తపంబుల ♦ యందుఁ గల్గు
స్థితికి 'స'త్తంచు సంజ్ఞగాఁ ♦ జెప్పుచుంద్రు;
* అందుచేఁ, జేయఁదగిన క ♦ ర్మాళి కూడ,
'స'త్తనెడి పేరుతోడ నె ♦ సంగుచుండు॥ 27

తే॥ గీ॥ హోమమో, దానమో, తప ♦ స్సో, మఱేదొ,
శ్రద్ధ లేకుండు దాని 'న ♦ స'త్తటంద్రు;
అనఘ! యీ 'యస'త్తిహలోక ♦ మందుఁగాని,
పరమునను గాని, సుంతయుం ♦ బనికి రాదు॥ 28

ఇది శ్రీ లక్ష్మీనరసమాంబా హనుమయార్య పుత్ర,
కవిజన విధేయ, మయిలవర వంశజు, వేంకటరామ నామధేయ
ప్రణీతంబైన "భగవద్గీతానువాదము" నందలి
'శ్రద్ధాత్రయ విభాగ యోగ' మను
పదునేడవ యధ్యాయము
సంపూర్ణము

---

* ఈ పాదము తిలక్ మహాశయుని వ్యాఖ్యానము ననుసరించుచున్నది. 'మఱి, తదర్థీయమైన క ♦ ర్మంబుగూడ,' అనియుం నీపాదమును గ్రహింపవచ్చును.

శ్రీ

# భగవద్గీతానువాదము

## పదునెనిమిదవ యధ్యాయము

### మోక్షసన్న్యాసయోగము

అర్జునుఁ డిట్లు ప్రశ్నించెను :

కం॥ అల సన్న్యాస త్యాగం
బులు రెంటి యథార్థతత్త్వ ♦ మును వేర్వేఱం
దెలియంగ నిచ్ఛగింతును;
సెలవిమ్మా, మహాభుజా! హృ ♦ షీకేశ! హరీ! 1

శ్రీ భగవానుఁ డిట్లు చెప్పెను :

తే॥ గీ॥ కామ్యనామక కర్మసం ♦ ఘాత మెల్ల
అసలెవదలుట సన్న్యాస ♦ మంద్రు బుధులు;
అఖిలకర్మల ఫలపరి ♦ త్యాగ మెదియొ,
దానినే త్యాగమందురు ♦ తత్త్వ విదులు॥ 2

తే॥ గీ॥ కర్మయే దోషసహితంబు ♦ గాన దాని
విడువ వలెనంచుఁ గొందఱు ♦ విబుధు లంద్రు;
యజ్ఞ, దాన, తపోరూప ♦ మైన కర్మ
వదలఁ దగదంద్రు తదితర ♦ ప్రాజ్ఞ జనులు॥ 3

తే॥ గీ॥ ఇట్టు లిరుపక్షముల్ గల్గు ♦ నట్టి దైన
త్యాగవిషయాన నానిశ్చ ♦ యంబువినుము;
త్యాగ మనునది మూఁడు వి ♦ ధంబులంచుఁ
బల్కఁబడుచుంట గుర్తింప ♦ వలయు, మొదట॥ 4

తే॥ గీ॥ యజ్ఞ, దాన, తపోరూప ♦ మైనకర్మ,
వదలఁ దగనిది, చేయంగ ♦ వలసినదియె;
యజ్ఞ, దాన, తపంబు లీ ♦ యవని యందుఁ,
పావనమ్ములు సుమ్ము వి ♦ ద్వాంసులకును॥ 5

తే॥ గీ॥ ఇట్టి యుత్కృష్ట కర్మంబు ♦ లేనిఁ, బార్థ!
సంగము త్యజించి, మఱి, ఫలా ♦ సక్తి విడిచి,
ఆచరింపంగ వలయునం ♦ చేస్మదీయ
మతి; యిది వినిశ్చితం, బుత్త ♦ మంబు సుమ్ము॥ 6

ఆ॥ వె॥ ధర్మ నియతమైన ♦ కర్మం బదెద్దియో
దాని సన్న్యసింపఁ ♦ దగవు గాదు;
మోహ పారవశ్య ♦ మున దానిఁ ద్యజియించు—
టద్ది తామసంపుఁ ♦ ద్యాగ మండ్రు॥ 7

తే॥ గీ॥ కాయ కష్టాన కడలి, దుః ♦ ఖకర మన్న
భావ మొకదానఁ గర్మంబు ♦ వదలివేయు—
జనుఁ డొనర్చు త్యాగంబు రా ♦ జసము సుమ్ము;
దాన, త్యాగఫలంబు సుం ♦ తయుఁ గనండు॥ 8

తే॥ గీ॥ చేయఁ దగినదె యన్న దృ ♦ ష్టిని వహించి,
ధర్మ నియమిత మైనట్టి ♦ కర్మ మెల్ల,
సంగము, ఫలమ్మును, త్యజియించి ♦ సల్పు నెడల,
అట్టి త్యాగంబు సాత్త్విక ♦ మని తలంత్రు॥ 9

తే॥ గీ॥ సత్త్వసంపన్నుఁడును, ఛిన్న ♦ సంశయుండు,
నాత్మ విజ్ఞాన యుక్తుండు ♦ నైన త్యాగి,
అశుభ కర్మంబు లన, ద్వేష ♦ మందఁబోఁడు,
కుశల కర్మానురాగ యు ♦ క్తుండు గాఁడు॥ 10

తే॥ గీ॥ కర్మములను నిశ్శేషంబు ♦ గాఁ ద్యజింప
నలవి గాదు శరీరధా ♦ రులకు జగతిఁ;
గర్మఫలములఁ ద్యజియింపఁ ♦ గలుగు నెవఁడు
వాఁడెపో త్యాగి యనఁజెల్లు, ♦ వర గుణాఢ్య! 11

తే॥ గీ॥ త్యాగహీనులౌ వారు జ ♦ న్మాంతరమునఁ
బ్రియమును, నప్రియమును, బ్రియా ♦ ప్రియము, నంచుఁ
గర్మఫలము, ముత్తెఱఁగులఁ, ♦ గాంచుచుంద్రు;
రది ఫలత్యాగు లొందరొ ♦ కప్పుడేని॥ 12

తే॥ గీ॥ అఖిల కర్మసంచయ ఫల ♦ ప్రాప్తికొఱకు
ఐదు కారణములు గల ♦ వంచుఁ ("కపిల")
సాంఖ్య సిద్ధాంత వివరణ ♦ స్థాపితంబు;
వాని విస్తరించెద నింక ♦ పైని, వినుము॥ 13

తే॥ గీ॥ ఆది దేహంబు, నటుపై న ♦ హంకృతియును,
వివిధ కరణంబులును, బహు ♦ విధములైన
ప్రాణచేష్టలు, దైవంబు, ♦ ననెడి వైదుఁ
గర్మ విషయంబు నందలి ♦ కారణములు॥ 14

తే॥ గీ॥ తనువు, వాక్కు, మన, స్సను ♦ త్రయముచేత,
నరుఁడు తా నెట్టి కర్మంబొ ♦ నర్చుచుండు,
అద్ది న్యాయ్యమె యైనఁ, న ♦ న్యాయ్య మైన,
దాని కీయైదె హేతుభూ ♦ తములు, పార్థ! 15

తే॥ గీ॥ ఈ విషయ నిశ్చయంబది ♦ యిట్టులుండఁ,
గర్మమున కాత్మ యొక్కండె ♦ కర్తయంచు
నెవఁ డసంస్కృత బుద్ధియై ♦ నెంచుచుండు,
అట్టి యవివేకి వాస్తవం ♦ బరయఁ, డనఘ! 16

తే॥ గీ॥ 'ఏనె కర్త' నటం చెవం ♦ డెంచఁబోఁడొ,
యెవనిమది కర్మలిప్తత్వ ♦ మెనయఁబోదొ,
అతఁ డీప్రాణులను జంపి ♦ నప్పటికిని,
జంపునట్టిఁడు గాఁడు, బం ♦ ధింపఁబడఁడు॥ 17

తే॥ గీ॥ జ్ఞానమన, జ్ఞేయమనఁ, బరి ♦ జ్ఞాతయనఁగఁ,
గర్మచోదనమది మూఁడు ♦ గతులఁ గాంచుఁ;
గరణమనఁ, గర్మమనఁగను, ♦ గర్తయనఁగఁ,
గర్మసంగ్రహమును మూఁడు ♦ గతులనుండు॥ 18

తే॥ గీ॥ 'జ్ఞాన, కర్మ, కర్త' లలో నొ ♦ కం డొకండు
త్రిగుణ భేదానుగుణముగఁ ♦ ద్రివిధ మంచుఁ
బ్రథిత గుణసాంఖ్య మందుఁ జె ♦ ప్పఁబడియుండెఁ;
అది యథారీతి బోధింతు ♦ నాలకింపు॥ 19

తే॥ గీ॥ భిన్న భిన్నాత్మక ప్రాణి ♦ వితతియందు
అవ్యయ, మఖండ, మేకమై ♦ యలరు బ్రహ్మ
భావ మేజ్ఞానమునఁ గాంచఁ ♦ బడునొ, యట్టి
జ్ఞానము నెఱుంగనొ సాత్త్వి ♦ కంబటంచు॥ 20

తే॥ గీ॥ అఖిల భూతంబులందు వే ♦ ఱైన గతులఁ
బరఁగుచుండెడి వేర్వేఱు ♦ భావములను
గానఁబడునట్లు వేర్వేఱు ♦ గా నెఱుంగు
జ్ఞానమయ్యది రాజస ♦ జ్ఞాన, మనఘ! 21

తే॥ గీ॥ తుచ్ఛమౌ నింత, నెంతొగా ♦ తోఁపఁజేసి,
అల్పఫల దాయకంబై, య ♦ హైతుకమయి,
పారమార్థిక తత్త్వ వి ♦ దూరమునగు
జ్ఞానమెయ్యది, అదితామ ♦ సం బటండ్రు॥ 22

తే॥ గీ॥ శాస్త్రనిర్ణీత కర్మముఁ ♦ సంగ రహిత
ముగను, మఱి, యరాగద్వేష ♦ ముగను, దాని
ఫలము గోరని పురుషుండు ♦ సలుపుచుండ,
అట్టి కర్మంబు సాత్త్విక ♦ మండ్రు బుధులు॥ 23

తే॥ గీ॥ కర్మ ఫలకాంక్ష వదలని ♦ కతనఁగాని,
'ఏనెకర్త' ననెడి యహం ♦ కృతినిగాని,
కడు శ్రమంబునఁ జేసెడి ♦ కర్మ మెదియొ,
అద్ది రాజస కర్మం బ ♦ టంద్రు, పార్థ! 24

ఆ॥ వె॥ కలుఁగబోవు వగపు ♦ గాని, వినాశంబు
గాని, ప్రాణిహింస ♦ గాని, స్వీయ
పౌరుషంబుగాని, ♦ ఆరయ కజ్ఞతఁ
సల్పు కర్మ తామ ♦ సం బటంద్రు॥ 25

తే॥ గీ॥ 'నేను నే' ననుభావంబు ♦ లేనివాఁడు,
సంగ రహితుండు, ధీరతో ♦ త్సాహయుతుఁడు,
కార్య సిద్ధ్యసిద్ధుల నిర్వి ♦ కారుఁ డెవఁడొ,
అట్టి కర్తను సాత్త్వికుం ♦ డంద్రు బుధులు॥ 26

తే॥ గీ॥ విషయ రాగాత్మకుఁడు, ఫలా ♦ పేక్షకుఁడును,
అశుచియును, లుబ్ధమతియు, హిం ♦ సాత్మకుఁడును,
హర్ష శోక ద్విభావ స ♦ మన్వితుఁడును,
అయిన కర్తను రాజసుం ♦ డని వచింత్రు॥ 27

తే॥ గీ॥ పామరుండు, నయుక్తుఁడుఁ, ♦ వంచకుఁడును,
మాయకాఁడు, స్తబ్ధుండు, సో ♦ మరియు, సతత
దుఃఖశీలుండు, దీర్ఘసూ ♦ త్రుండు నెవఁడొ,
అట్టి కర్తను తామసుం ♦ డంద్రు బుధులు॥ 28

తే॥ గీ॥ ఫల్గునా! 'బుద్ధి, ధృతు'లను ♦ ద్వయముగూడఁ,
త్రిగుణ భేదానుగుణముగఁ ♦ త్రివిధ మంచుఁ
జెప్పుదురు; వాని నింక న ♦ శేషముగను,
విభజ నాత్మకముగను, జె ♦ ప్పెదను వినుము॥ 29

తే॥ గీ॥ ఇది ప్రవృత్తి, నివృత్తినా ♦ నిద్ది; కార్య
మనఁగ నిద్ది, యకార్య మి ♦ య్యది; భయాభ
యంబు లన నివి; బంధ మో ♦ క్షంబు లివ్వి;
అని తెలియు బుద్ధి సాత్త్విక ♦ మయ్యె, పార్థ! 30

ఆ॥ వె॥ ధర్మ మనఁగ నిది, య ♦ ధర్మంబనఁగ నిద్ది,
కార్య మనఁగ నిది, య ♦ కార్య మిద్ది,
అనునవి, అయథార్థ ♦ మారీతి గ్రహియించు
బుద్ధి రాజసంపు ♦ బుద్ధి సుమ్మి॥ 31

తే॥ గీ॥ అనఘ! యజ్ఞాన మను తమ ♦ స్సావరింప,
నెది యధర్మంబు ధర్మమం ♦ చెంచునదయి
సర్వ విషయాళి విపరీత ♦ సరణిఁ దలఁచు,
అద్ది తామసమౌ బుద్ధి ♦ యని తలంత్రు॥ 32

తే॥ గీ॥ ఇంద్రియ, ప్రాణ, మానస ♦ వృత్తు లెల్ల,
ఏ ధృతి వహింప, నచలమై ♦ యెసఁగునట్టి
యోగయుక్తిని నియమింప ♦ నోపియుండు,
అద్ది సాత్త్వికమౌ ధృతి ♦ యండ్రు, పార్థ! 33

తే॥ గీ॥ కర్మ ఫలమందు నాకాంక్ష ♦ గల్గువాఁడు
తీవ్రమౌ తృష్ణచేత, నే ♦ ధృతి వహించి,
ధర్మ కామార్థములను జి ♦ త్తమున నిలుపు,
అద్ది రాజసమౌ ధృతి ♦ యని వచింత్రు॥ 34

తే॥ గీ॥ ఏ ధృతి వహించియున్నట్టి ♦ హేతువునను,
దుష్టబుద్ధి గలాఁడు ని ♦ ద్దురయు, వగయు,
భయముఁ, జింతయు, మదమును ♦ వదలలేఁడో,
అద్ది తామసమౌ ధృతి ♦ యని వచింత్రు॥ 35

తే॥ గీ॥ సుఖము సైతముఁ ద్రివిధంబు; ♦ సొరిది దాని
వివరణం బిప్డు చెప్పెద ♦ వినుము, పార్థ !
పూరుషుం డెందు, నభ్యాస ♦ మున, రమించు,
ఎందు దుఃఖాంతమును సైత ♦ మొందఁ గలఁడో,

తే॥ గీ॥ మొదట నెయ్యది విషతుల్య ♦ ముగను దోఁచి,
అమృత తుల్యత పరిణామ ♦ మందుఁ గాంచు,
అట్టి యాత్మ బుద్ధి ప్రసా ♦ దైక జనిత—
సుఖము సాత్త్విక సుఖ మటం ♦ చు వచియింత్రు॥ 36, 37

తే॥ గీ॥ కరణ, కరణార్థ, సంయోగ ♦ కలనచేత,
ఆది నెయ్యది యమృత తు ♦ ల్యముగఁ దోఁచి,
అనుభవానంతరము విష ♦ మనఁగఁ దేలు,
అట్టి సౌఖ్యంబు రాజస ♦ మని వచింత్రు॥ 38

తే॥ గీ॥ అధిక నిద్రా, ప్రమాద, మాం ♦ ద్య ప్రభూత
మై, యనుభవ విపాకంబు ♦ లందుఁగూడ
ఆత్మ సమ్మోహ హేతువై ♦ నట్టి సుఖము
తామసంబైన సుఖమండ్రు ♦ తత్త్వ విదులు॥ 39

తే॥ గీ॥ క్ష్మాతలంబునఁగాని, నా ♦ కమునఁగాని,
నాకమందలి దేవత ♦ లందుగాని,
ప్రకృతిభవమైన యీగుణ ♦ త్రయమునుండి
విడుపు చెందిన సత్త్వ మె ♦ క్కడను లేదు॥ 40

తే॥ గీ॥ బ్రాహ్మణ క్షత్ర వైశ్య శూ ♦ ద్రజనములకుఁ
బూర్వజన్మ సంస్కార స ♦ ముద్భవంబు
లైన సత్త్వాది గుణముల ♦ ననుసరించి
కర్మములు సైతమును విభ ♦ క్తంబులయ్యె॥ 41

తే॥ గీ॥ శమము, దమము, తపంబు, శౌ ♦ చంబు, క్షమయు,
ఆర్జవంబును, బరమేశ్వ ♦ రాస్తికతయు,
జ్ఞాన విజ్ఞానములు నను ♦ కర్మలెల్లఁ
బ్రకృతి నియమిత కర్మముల్ ♦ బ్రాహ్మణులకు॥ 42

తే॥ గీ॥ శూరతయుఁ, బరాక్రమమును, ♦ ధీరతయును,
ఆహవాపలాయనము, స ♦ మర్థతయును,
దానమును, బ్రజా పాలక ♦ త్వంబు ననెడి
కర్మములు స్వభావజములు ♦ క్షత్రియులకు॥ 43

తే॥ గీ॥ పసుల రక్షయుఁ, గృషియును, ♦ వర్తకంబుఁ,
ప్రకృతి నియమిత కర్మముల్ ♦ వైశ్యులకును;
అనఘ! సేవా స్వరూపక ♦ మైన కర్మ,
పాద సంజాతులకు స్వభా ♦ వజము సుమ్ము॥ 44

తే॥ గీ॥ జనులు తమతమ కర్మ లు ♦ త్సాహయుక్తిఁ
జేయుచుండిన, సంసిద్ధి ♦ చెందఁ గలరు;
స్వీయ కర్మానురక్తుఁడై ♦ చెలఁగు నరుఁడు
సిద్ధి నెట్టులఁ గనునో వ ♦ చింతు వినుము॥ 45

తే॥ గీ॥ ఎవనివలన భూతాళి ప్ర ♦ వృత్తి వడసె,
సర్వమియ్యది యెవనిచేఁ ♦ బర్వియుండె,
అట్టి యీశ్వరు, స్వీయ క ♦ ర్మాళిచేతఁ,
బూజన మొనర్చి సంసిద్ధిఁ ♦ బొందు నరుఁడు॥ 46

తే॥ గీ॥ మహిని, సమనుష్ఠిత పరాన్య ధ ♦ ర్మంబు కంటె
స్వీయ ధర్మంబె శ్రేయమౌ ♦ విగుణ మయ్యుఁ;
బ్రకృతి నిర్ణీతమైన క ♦ ర్మం బొనర్పఁ
బాతకము నొందఁబోవఁడె ♦ వ్వఁడును, పార్థ! 47

తే॥ గీ॥ సహజ మైనట్టి కర్మంబు, ♦ సవ్యసాచి!
దోష సహితంబె యైనను ♦ దొఱఁగరాదు,
అగ్ని పొగచేత నావృత ♦ మైన భంగి
ఎల్లకర్మలు దోషసం ♦ వృతము లగుట॥ 48

తే॥ గీ॥ దార పుత్త్ర ధనాద్యస ♦ క్త హృదయుండు,
జిత మనస్కుండు, నిర్వృత ♦ స్పృహుఁ డెవండొ,
యట్టివాఁడు కర్మఫల స ♦ న్న్యాసమునను,
బరమ నైష్కర్మ్య సిద్ధిని ♦ బడయఁ గలఁడు॥ 49

తే॥ గీ॥ ఇట్టి నైష్కర్మ్యమును బొంది ♦ నట్టినరుఁడు
బ్రహ్మమును గాంచఁగల్గు మా ♦ ర్గమయి యొప్పు
శ్రేష్ఠమగు జ్ఞాననిష్ఠ, సం ♦ క్షేపరీతిఁ,
దెలియఁబఱతును; మద్వాక్య ♦ ములను వినుము॥ 50

తే॥ గీ॥ భావవృత్తి వినిర్మల ♦ త్వంబు గల్గి,
ఆత్మ ధృతిచేత, వినియమి ♦ తాత్ముఁ డగుచు,
శబ్ద రూపాది విషయ సం ♦ సర్గ మెడపి,
రాగ, వైర, ద్వయంబుఁ దో ♦ ఱంగ నేర్చి,

తే॥ గీ॥ స్వల్పముగ భుజియించు, చే ♦ కాంత వాస
మూని, నియత శరీర వా ♦ క్మానసుఁడయి,
నిరతమును ధ్యానయోగ త ♦ త్పరత గాంచి,
అలఘు వైరాగ్య భావంబు ♦ నాశ్రయించి,

తే॥ గీ॥ స్వాతిశయమును, బలము, న ♦ హంకృతియును,
కామమును, క్రోధమును, బరి ♦ గ్రహము నెడలి,
నిర్మముండై ప్రశాంతుఁడై ♦ నెగడువాఁడు
బ్రహ్మభావంబుఁ బడయ న ♦ ర్హతను గాంచు॥
51, 52, 53

తే॥ గీ॥ అట్టి బ్రహ్మభూతుఁడు, ప్రస ♦ న్నాత్ముఁ డగుచుఁ,
గుందఁబోవంఁడు, దేనిని ♦ గోరఁబోఁడు;
భూతసర్వంబునం దను ♦ బుద్ధి గలిగి
పడయనేర్చును మత్పరా ♦ భక్తి నపుడు॥ 54

తే॥ గీ॥ పార్థ! నేనెవ్వఁడనొ, యెట్టి ♦ వాఁడనో యను
నా స్తవంబు నెఱుంగు నా ♦ భక్తిచేత;
ఇట్లు నన్ గూర్చి కలరీతి ♦ నెఱుఁగ నేర్చి,
దాస, తదనంతరంబు నా ♦ లోనె చేరు॥ 55

తే॥ గీ॥ సర్వకర్మంబులును సదా ♦ సల్పుచుండు—
నిరుఁడు సైతము, నన్ శర ♦ ణంబుఁ జొచ్చి,
నా యనుగ్రహమునను, వి ♦ నాశ రహిత
మైన శాశ్వత మోక్షంబు ♦ నందఁ గలఁడు॥ 56

తే॥ గీ॥ ననుఁ బరమగతిగా నెంచి, ♦ మనసుచేత—
సర్వకర్మాళి నాయందు ♦ సన్న్యసించి,
సామ్యబుద్ధియోగం బూని, ♦ సంతతంబు
నీవు చిత్తంబు నాయందె ♦ నిలుపుమయ్య॥ 57

తే॥ గీ॥ మత్సమర్పిత మతివయి, ♦ మత్ప్రసాద
మున విపత్తులు సర్వంబు ♦ లును దరింతు;
విఁక నహంకృతి, నేఁజెప్పు ♦ హితము వినక
పెడచెవింబెట్టఁ జూతువో, ♦ చెడెద వీవు॥ 58

తే॥ గీ॥ వ్యర్థమైన యహంకార ♦ మాశ్రయించి,
భండనము సేయనని పట్టుఁ ♦ బట్టితేని,
నీదు నిశ్చయమిది సాగఁ ♦ బోదు సుమ్ము;
ప్రకృతియె నియుక్తుఁజేయుఁ గ ♦ ర్మమున నిన్ను॥ 59

తే॥ గీ॥ మోహవిభ్రాంతి నే కార్య ♦ మును బొనర్ప
నిష్టపడఁబోవొ, అద్దాని ♦ నే, స్వభావ
సిద్ధమగు నీదు కర్మచే ♦ బద్ధుఁడవయి,
పరవశతఁ జేయఁబోయెడి ♦ వాఁడ వగుదు॥ 60

తే॥ గీ॥ యంత్రములమీఁద నెక్కించి ♦ నట్లు ప్రాణి
బృందముల స్వీయ మాయచేఁ ♦ ద్రిప్పుచుఁ, బర
మేశ్వరుం డెల్లప్రాణుల ♦ హృదయ సీమ
నిల్చియున్నాఁడు సుమ్ము, కుం ♦ తీ కుమార! 61

తే॥ గీ॥ కనుక, వానినె సర్వ ప్ర ♦ కారములను,
శరణు చొచ్చుము, భరత వం ♦ శ ప్రదీప!
తత్ప్రసాదంబు వలనఁ బొం ♦ దఁగల వీవు:
పరమ శాంతియు, నిత్యమౌ ♦ పరమ పదము॥ 62

తే॥ గీ॥ ఇట్లు, గుహ్యార్థముల కంటె ♦ హెచ్చు గుహ్య
మైన జ్ఞానంబు చెప్పితి ♦ నయ్య నీకుఁ;
జెప్పినది పూర్ణముగ విమ ♦ ర్శించి పిదప
నాచరింపుము నీ కిష్ట ♦ మైనయట్లు॥ 63

తే॥ గీ॥ నీవు నాకుఁ బ్రియుండవౌ ♦ నిశ్చయమునఁ
దావక హితంబు నాదు చి ♦ త్తమున నెంచి,
సర్వగుహ్యతమంబై ప్ర ♦ శస్తమైన
మాట యొక్కటి చెప్పెద ♦ మఱల వినుము॥ 64

తే॥ గీ॥ నను భజింపుము, నాపై మ ♦ నస్సు నిడుము,
నాకె సల్పుము మఖముల్ ప్ర ♦ ణామములును;
బడయుదిఁక నన్నె; యిది వా ♦ స్తవము సుమ్ము;
ప్రతిన సేయుదుఁ బ్రియుఁడవై ♦ పరఁగు నీకు॥ 65

తే॥ గీ॥ ధర్మజాలంబు నెల్లఁ ద్య ♦ క్తంబు చేసి,
శరణు చొచ్చుము న, న్నొక ♦ శరణ మంచుఁ;
బార్థ! నిను నే సమస్త పా ♦ పములనుండి
ముక్తుఁ జేయుదు; దుఃఖంబు ♦ పొంద వలదు॥ 66

తే॥ గీ॥ నీకు బోధించినట్టి దీ ♦ ని, నతపస్కు-
నకును, నట్లె, యశుశ్రూషు ♦ నకును, భక్తి-
శూన్యునకును, నేనన్న న ♦ సూయఁజెందు
వానికిని, దెల్పఁబోల దె ♦ ప్పటికి నేని॥ 67

తే॥ గీ॥ ఎవ్వఁ డుత్తమ భక్తి నా ♦ యెడల నిల్పి
పరమ గుహ్యంబు దీని నా ♦ భక్త బృంద
ములకు నుపదేశ మొనరింపఁ ♦ గలఁడొ, యట్టి
జనుఁడు పొందును నన్నె య ♦ సంశయముగ॥ 68

ఆ॥ వె॥ అతనికంటె మనుజు ♦ లందు నాకుఁ బ్రియంబు
గూర్చువాఁ డొకండు ♦ గూడ లేఁడు;
వానికంటె నిష్టుఁ ♦ డౌ నరుం డెవఁడును
ముందునైన నుండఁ ♦ బోఁడు భువిని॥ 69

కం॥ మఱి యెవఁడు, ధర్మ్యమగు, మన
* యిరువురి సంవాదమున్, బ ♦ ఠించునొ వాఁ, డి
ద్ధర, జ్ఞానయజ్ఞమున, నన్
బరిపూజితుఁ జేయునట్టి ♦ వాఁడని తలఁతున్॥ 70

తే॥ గీ॥ ఎవఁడు శ్రద్ధాసమేతుఁడై, ♦ యీసుదనము
లేనివాఁడయి, దీని నా ♦ లించుచుండు,
ఆతఁడుం బాపవిముక్తి ♦ నందఁ గల్గి
పుణ్యకర్ముల శుభలోక ♦ ములను బొందు॥ 71

తే॥ గీ॥ అస్మదీయోపదేశ మే ♦ కాగ్రమైన
చిత్త మొదవించి యాలకిం ♦ చితివె, పార్థ!
ఇఁకఁ, ద్వదజ్ఞానసమ్మోహ ♦ మేదిగలదో,
అది యశేషమ్ముగ నశించె ♦ నా? కిరీటి! 72

అర్జునుఁ డిట్లు పల్కెను :

తే॥ గీ॥ అచ్యుతా! నాకుఁ ద్వదనుగ్ర ♦ హంబు వలన,
మోహము నశించె, జ్ఞానవి ♦ స్ఫురణ మొదవె;
సంశయంబులు పోయి ని ♦ శ్చలతనుంటి;
ఆచరించెద నీచెప్పి ♦ నట్టు లింక॥ 73

* యిరువురి సంవాదముఁ బఠి ♦ యించునొ వాఁ, డి

సంజయుఁ డిట్లు పల్కెను :

తే॥ గీ॥ ఇట్లు విన్నాఁడనయ్యా, పృ ♦ థ్వీశమౌళి !
అద్భుతావహమును, రోమ ♦ హర్షణమును,
అయి, హరికిని, మహాత్ముఁడౌ ♦ నర్జునునకు
నడిచియున్నట్టి సంభాష ♦ ణం బదెల్ల॥ 74

తే॥ గీ॥ వ్యాసుని యనుగ్రహమున నీ ♦ పరమగోప్య
మైన యోగంబుఁ, దానె ప్ర ♦ త్యక్షముగను
బల్కు యోగేశుఁడౌ కృష్ణు ♦ వలన, నాదు
వీనులారంగ వింటిఁ, బృ ♦ థ్వీ బిడౌజ ! 75

తే॥ గీ॥ పావనంబును, నద్భుతా ♦ వహము నైన
వాసుదేవ కిరీటి సం ♦ భాషణంబు
మఱల మఱలఁ దలంచుచు ♦ మాటిమాటి
కలరుచున్నాఁడనయ్యా, ధ ♦ రాధినాథ ! 76

తే॥ గీ॥ ఇదియెగాక, మహాద్భుత ♦ దృశ్యమైన
మాధవుని విశ్వరూప, మా ♦ త్మగతియందు
మఱిమఱి స్మరించి, యధిక వి ♦ స్మయము చెంది,
మఱలమఱలఁ బ్రమోద సం ♦ భ్రమము గాంతు॥ 77

తే॥ గీ॥ ఎచట యోగేశ్వరుండైన ♦ కృష్ణుఁ డుండు,
ఎట ధనుర్ధరుఁడౌ పార్థుఁ ♦ డెసఁగుచుండు,
అచట శ్రీ, విజయ, విభూతు, ♦ లచలమైన
నీతియు, స్థిరంబు లంచు నా ♦ నిశ్చయంబు॥ 78

ఇది శ్రీ లక్ష్మీనరసమాంబా హనుమయార్య పుత్ర,
కవిజన విధేయ, మయిలవర వంశీయ, వేంకటరామ నామధేయ
ప్రణీతంబైన "భగవద్గీతానువాదము" నందలి
'మోక్షసన్న్యాస యోగ' మను
పదునెనిమిదవ యధ్యాయము
సంపూర్ణము

ఇట్లు లక్షగ్రంథమగు శ్రీమన్మహాభారతములోని
భీష్మపర్వమునందలి
ఉపనిషత్తుల్యమును, బ్రహ్మవిద్యాప్రతిపాదకంబును,
యోగశాస్త్రంబును, శ్రీకృష్ణార్జున సంవాదాత్మకంబును,
అగు
శ్రీ భగవద్గీతయొక్క ఆంధ్రపద్యరూపకానువాదము
సర్వమును సంపూర్ణము.
శ్రీకృష్ణార్పణమస్తు.



# లఘుటిప్పణి.

[గమనింపు:- ఇందు, రోమను సంఖ్యలు, అధ్యాయ సంఖ్యలు; హైందవ సంఖ్యలు, అధ్యాయాంతర్గత పద్య సంఖ్యలు]

I (1) రణచికీర్షులు = యుద్ధముచేయఁగోరువారు; (4) ఇష్వాసులు= విలుకాండ్రు; (10) పర్యాప్తము=పరిపూర్ణము, పరిమితము (అని శ్లేషార్థము); (13) ఆనకము = తప్పెట; ఉడుక = సూక్ష్మ మృదంగ విశేషము; గోముఖము = ఒక రకము మృదంగము.

II (2) కశ్మలము = మోహము (లేక) అజ్ఞానము; (3) క్లైబ్యము = అధైర్యము (5) భైక్షము = భిక్షాన్నము (7) కృపణత = (వీరినిజంపి, మన మెట్లు జీవింతుమను) మనోదైన్యము (14) పంచతన్మాత్రములు = సూక్ష్మ వస్తువులందలి పంచభూతములు (16) సద్వస్తువు = (సత్ + వస్తువు) ఆత్మ వస్తువు; అసద్వస్తువు = జడప్రకృతి; (40) వమ్ము = వృథాయైపోవుట; (44) సమాధి = చిత్తముయొక్క-ఏకాగ్రస్థితి; (45) త్రైగుణ్యము = సత్త్వ రజస్తమో గుణములు (వానిసముదాయము); యోగక్షేమము; యోగము = సంపాదించుట; క్షేమము = సంపాదించిన దానిని సంరక్షించుట; (49) బుద్ధియోగము = ఏబుద్ధితోఁ గర్మలఁజేసిన వానియందలి దోషము పోవునో, అట్టి బుద్ధితోడి కూడిక; (54) స్థితప్రజ్ఞుఁడు = నిశ్చల బుద్ధిగల పురుషుఁడు; (72) బ్రహ్మ నిర్వాణము = మోక్షము.

III (2) వ్యామిళితము (వి + ఆ + మిళితము) = మిశ్రము (4) నైష్కర్మ్యము = కర్మరాహిత్యము (6) మిథ్యాచారుఁడు = కపటమైన ఆచారముగలవాఁడు; (11) భావించుట = ఆరాధించుట, వృద్ధిపొందించుట, సంతోషపెట్టుట; (15) బ్రహ్మము = ప్రకృతి, వేదము, పరమాత్మ; (20) లోకసంగ్రహము = లోక మయుక్తమార్గమునఁ బడకుండునట్లు చేయుట; (లోకకల్యాణము)

IV (15) ముముక్షువులు=మోక్షము గోరువారు, (17) వికర్మము=శాస్త్రనిషిద్ధకర్మ; (24) పాత్ర=యజ్ఞపాత్ర; ద్రవ్యము = హోమద్రవ్యము; బ్రహ్మ=పరబ్రహ్మ (కర్మశబ్దమువలె, చరిత్రాదులలోఁజేర్చి యుపయోగింపఁ బడినది)

V (21) బ్రహ్మయోగయుక్తాత్ముఁడు = బ్రహ్మముతో అనుసంధానము చేసిన మనస్సు గలవాఁడు.

VI (3) శమము=చిత్తశాంతి; (4) యోగారూఢుఁడు = యోగమందుఁ బైమెట్టునకుఁ బోయినవాఁడు (8) అశ్మము=ఱాయి; లోష్టము = మంటిగడ్డ; కూటస్థుఁడు = చలింపఁజేయనలవి కానివాఁడు; (25) ఉపరమించుట=శాంతిఁజెందుట (34) ప్రమాథి=కలఁతపెట్టునది; (44) జిజ్ఞాసువు = ఎఱుఁగఁగోరువాఁడు. (47) అంతరాత్మ=అంతఃకరణము. ఈ యధ్యాయమునందు విశేషించి చెప్పిన యోగము, "పతంజలి" యోగము. శ్రీకృష్ణ యోగమునం దీయోగ మొక యుపాంగము. రెండును ఒకటికాదు.

VII (5) అపరాప్రకృతి = జడ ప్రకృతి; పరాప్రకృతి = జీవుఁడు (14) దురత్యయము=దాఁట శక్యముగానిది; (25) యోగమాయ=సత్త్వరజస్తమో గుణములతోఁ గూడియుండుటయే యోగము; అట్టి కూడికయను మాయయే, యోగమాయ.

VIII (3) విసర్గము = విడుచుట (release-of a latent force) (12) మూర్ధము = శిరస్సు అని స్థూలమగు నర్థము; ఇచ్చటి సందర్భమునుబట్టి కనుబొమల మధ్యస్థాన మని కొందఱు టీకాకారు లభిప్రాయము నిచ్చియున్నారు; (17) యుగము = మహాయుగము; నాల్గుయుగములును యుగసంధులతోఁగలిసి, ఒక మహాయుగ మగును. అట్టి మహాయుగములు వేయియైన బ్రహ్మదేవునికిఁ బగ లనియు, ఇంకొక వేయియైన రాత్రి యనియు,

ఇందలి తాత్పర్యము; ( 23—25 ) కాలంపుమార్గము = కాలసంబంధమైన మార్గము; ఈ పద్యములందుఁ గాలమే మార్గముగాఁ జెప్పఁబడినది. (24, 25) ఈ రెండు పద్యములలోఁ జెప్పిన అగ్ని మొదలైన శబ్దములవలన, ఆయా యభిమాన దేవతలను గ్రహింపవలెను. 24వ పద్యములోఁ జెప్పఁబడిన మార్గమును, అర్చిరాదిమార్గము, దేవయానము లేక శుక్లగతి అనిచెప్పుదురు. 25 వ పద్యములోఁ జెప్పినమార్గమును, ధూమాదిమార్గము, పితృయాణము లేక కృష్ణగతి అనిచెప్పుదురు. ఆయా యభిమాన దేవతలు జీవుని యీ మార్గముల నుత్తర లోకములకుఁ దీసికొనిపోవుదురని వైదికమతము.

IX (1) గుహ్యము=గోప్యమైనది, లేక గూఢమైనది; (10) విపరివర్తించు=ప్రవర్తించు, (32) పాపయోనులు=హీనజాతులు; నిమ్న జాతులు.

X (6) నాల్గురు=వాసుదేవుఁడు, సంకర్షణుఁడు, ప్రద్యుమ్నుఁడు, అనిరుద్ధుఁడు, అను చతుర్వ్యూహము—ఈనల్గురును ఒక్కఁడేయగు కృష్ణుని యొక్క భావములని పద్యతాత్పర్యము. (22) కరణములు=ఇంద్రియములు.

XI (6) అశ్వులు=అశ్వినీదేవతలు (22) విశ్వుఁడు=విశ్వేదేవత; ఊష్మపావళి=పితృదేవతల సమూహము (30) ఆస్వాదనము = నాలుకతోఁ జవిచూచుట (33) సేవించు=అనుభవించు; (47) ఆత్మయోగంబుచే = నా సంకల్పము వలన; (52) సుదుర్దర్శము=అత్యంతము చూడ నశక్యమైనది;

XII (4) కూటస్థుఁడు = ప్రకృతియందున్నవాఁడు; (20) శ్రద్ధధానులు = విశ్వసించినవారు;

XIII (2) మీమాంసకులు—పూర్వ మీమాంసకులు = (కామ్య) కర్మ ప్రతిపాదక శాస్త్రవేత్తలు; ఉత్తర మీమాంసకులు=బ్రహ్మ ప్రతిపాదక శాస్త్రవేత్తలు; ఇక్కడ ఉత్తర మీమాంసకులను గ్రహింపఁదగియున్నది; (3) క్షేత్రనికాయము=క్షేత్రముల తెగ ( kshetra - category )

క్షేత్రజ్ఞాత = క్షేత్రజ్ఞుఁడు, క్షేత్రము నెఱుఁగువాఁడు; (5) బ్రహ్మసూత్రములు = బాదరాయణుని వేదాంత సూత్రములు (శారీరక సూత్రములు)(లేక) బ్రహ్మమును దెలియఁజేయు ఉపనిష ద్వాక్యములు; (6) మహత్తు = బుద్ధి తత్త్వము; (ఇది సాంఖ్యుల 24 తత్త్వములలో నొకటి); (13) జ్ఞేయము = తెలియఁదగినది, బ్రహ్మవస్తువు; (27) సత్త్వము = వస్తువు.

XIV (2) సాధర్మ్యము=సాయుజ్యము, (సారూప్యము లేక సాలోక్యము) (26) ఐకాంతిక భక్తి=ఇతరాశ్రయములేని భక్తి, అనన్య భక్తి.

XV (1) అశ్వత్థము = రావిచెట్టు; ఇట, సంసార వృక్షము (లేక) ప్రపంచ వృక్షము; (16) కూటస్థుఁడు = జీవుఁడు.

XVI (17) ఆత్మసంభావితులు = తమ్మేఁదాము గొప్పగాఁ దలఁచుకొనువారు; స్వయంభువులు = తమంతట తామే పుట్టినవారు (వినయ విధేయతలు లేని గర్వితులని తాత్పర్యము)

XVII (3) సత్త్వానురూపము — సత్త్వమున కనురూపము; సత్త్వము=అంతఃకరణము; శ్రద్ధాఫలము=శ్రద్ధయొక్క పరిణామము; (9) కడిఁది=అధికమైన; రూక్షములు=చమురులేనివి; (10) పర్యుషితము=వండిన తరువాత నొకరాత్రి గడచినది; యజ్ఞానర్హము=యజ్ఞమునకుఁ దగనిది, అపవిత్రమైనది, భగవన్నివేదితము కానిది; (23-27) ఈ అధ్యాయములోఁ జెప్పఁబడిన ఆహార, యజ్ఞ, తపో, దానములవలె, బ్రహ్మనామము (ఓంతత్ సత్) కూడఁ ద్రివిధమని యీపద్యముల తాత్పర్యము. ఓం, సర్వాత్మకమగు బ్రహ్మమును దెల్పును; తత్ =అది; సామాన్యమైన కర్మకంటెఁ బరమందున్న నిష్కామకర్మను దెల్పును; సత్, ఫలాశయున్నను శాస్త్రసమ్మతముగఁ జేయఁబడిన సత్కర్మను దెల్పును; (28) అసత్, దుష్కర్మను దెలియఁజేయును.

XVIII (10) అశుభ కర్మ్మంబులు=అకుశల కర్మ్మలు, దుఃఖకరమగు కర్మ్మలు, చెడ్డకర్మ్మలు; కుశలకర్మ్మలు=సుఖకరమగు కర్మ్మలు, మంచి కర్మ్మలు; (13) కపిల సాంఖ్యము = కపిల మహామునిచేఁ బ్రతిపాదింపఁబడిన సాంఖ్యము; శ్రీకృష్ణ సాంఖ్యము, కపిల సాంఖ్యము, కేవలము ఒకటిగాదు; (19) గుణసాంఖ్యము=త్రిగుణములను గూర్చి వివరించి చెప్పు కపిల సాంఖ్యము.

సమాప్తము.



